





# జీవిత చరిత్ర

## అమరజీవులు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000002463



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అ మ ర జీ వు లు

బుద్ధభగవానుఁడు - ఏసుక్రీస్తు ప్రభువు - గాంధీమహాత్ముడు

జీ వి త చ రి త్ర లు.

ర చ యి త :

శ్రీ నండూరి రామకృష్ణమాచార్య. ఎం. ఏ.

మూల్యం రు 1—0—0

# తొలి నుడి

మహాపురుషుల జీవితచరిత్రలు మరణముతో సమాప్తము కావు. వారిచరిత్ర ప్రభావము యుగయుగాంతరములు ప్రసరించుచునే యుండును.

ఈ భూలోకమును మానవునకు వాసయోగ్య మొనరించుటకు సర్వస్వమును సమర్పించిన త్యాగవీరులు బుద్ధభగవానుడు, ఏసు క్రీస్తు ప్రభువు, గాంధీ మహాత్ముడు. ఈ అమరజీవు లుద్భవింపక పోయినచో మానవుని హృదయము చీకటి నీడ గుంపులు వసించెడి కుళ్లిన వల్లకాడుగనే యుండెడిది. ప్రపంచ చరిత్రయే వేరుగ నుండెడిది.

విశ్వశ్రేయస్సునకై వినియోగించిన వారి జీవితములే మహాకావ్యములు. మహేతిహాసములు. మహా నీతి శాస్త్రములు. ఉన్నత పాఠశాలలో నున్న విద్యార్థుల కోమల మనస్సులలో నీ త్రిమూర్తుల చరితలు లేశమాత్రముగనైన హత్తుకున్న వారుత్తమ ప్రపంచ పౌరులుగా, ధర్మవీరులుగ దమ జీవితమును దిద్దుకొనగలరు. అట్టి సత్సంకల్పమున కీ రచన దోహదము కల్పించిన రచయిత ధన్యుడు.

సంస్కృతమునందుగల అశ్వఘోషుని బుద్ధచరిత్ర, ఆంగ్లమునందుగల యెడ్విను ఆర్నాల్డు ఆసియాజ్యోతి బుద్ధజీవిత చిత్రణమున కుపకరించినవి. ఏసుక్రీస్తు జీవిత వృత్తాంతమునకు న్యూటెస్టమెంటు, ఏసుక్రీస్తు జీవితమను గ్రంథము నాధారములు. స్థలదేశ వ్యక్తి నామముల యుచ్చారణమున మూలగ్రీకు బైబిలు ననుసరించిన తెలుగు బైబిలే మాతృకగా గైకొనబడినది. ఏసు క్రీస్తు ప్రభుని జీవిత రచనమున దోసగులు దొరలకుండ రచయిత సల్పిన ప్రయత్నము ననుశీలింతురుగాక: అయినను మతాంతరు లెంత

గౌరవభావములతో వ్రాసినను క్రైస్తవులకు నొప్పి గలిగించు వాక్యము లేమైన నప్రతర్కితముగఁ దొరలిన వేమో! అట్లైన వానిని రచయిత యజ్ఞానమున కారోపింతురు గాత! అంతియే గాని జగదారాధ్యుఁడైన యేసు క్రీస్తు ప్రభువుపై రచయితకుఁగల పూజ్యభావమును మాత్రము శంకింపకుందురు గాక. గాంధి జీవిత రచనకు మహాత్ముని యాత్మకథ, యీ చారిత్రాత్మిక యుగమున రచయిత సమకాలీనత తోడ్పడినవి. ఈ మూర్తిత్రయమే గాక అమరజీవులైన మహాపురుషు లెందరో యున్నారు. వారి నందరి నీ చిఱుత గ్రంథములోఁ జేర్పక పోవుటకు సమర్థనీయ మైన కారణములు లేకపోవచ్చు. కాని-యీ మువ్వురను జేర్చుటకు మాత్రము ప్రస్ఫుట కారణము వారి సందేశములలోఁగల యహింసాధర్మసామ్యమే. ఈ మువ్వురు త్యాగవీరులు నహింసావాదులే.

బుద్ధభగవానుని ధర్మచక్రమునే యశోకచక్రవర్తి శిరసా వహించెను. ఆ ధర్మచక్రమే నేటి స్వతంత్ర భారత పతాకమున తాండవించుచున్నది. బుద్ధుఁడు, ఏసు క్రీస్తు, అహింసామూర్తి జాతీయపిత బాపూజీపై నెరపిన ప్రభావము జగద్విదితము. ఈ మువ్వురి జీవిత వృత్తములు యువభారతమున నవశ్యపఠనీయములు.

సులభశయ్యలో సరళభాషలో సున్నత పాఠశాలలోని విద్యార్థుల కుత్తేజము కలిగించి భావిభారత పౌరులను లోకోత్తర ధర్మవీరులుగఁ బ్రోత్సహించుటయే యీ రచనకు లక్ష్యము.

కవితా ప్రభాస
భీమవరము.

నండూరి రామకృష్ణమాచార్య.

# అనుక్రమణిక


| | | | | |
|---|---|---|---|---|
| బుద్ధుఁడు | .... | .... | పుట | 1 |
| ఏసు క్రీస్తు | .... | .... | ,, | 48 |
| గాంధి | .... | .... | ,, | 80 |

# అమరజీవులు

## బుద్ధుఁడు

హిమాలయపర్వతపరంపరలమధ్య రోహిణీనదీ తీరమున నున్న కపిలవస్తుపురము రాజధానిగ శాక్యరాజ్యమును శుద్ధోదనమహారాజు పరిపాలించెను. అతని యగ్రమహిషి మాయాదేవి. ద్వితీయభార్య ప్రజావతి. ప్రజావతి కొక పుత్రిక కలిగెను. చాలకాలము వరకు శుద్ధోదన ప్రభువునకుఁ బుత్రసంతానము కలుగలేదు. మాయాదేవి యొక నాఁడు శ్వేతమత్తేభము తన గర్భములోఁ బ్రవేశించి నట్లు కలగాంచెను. శుద్ధోదనుఁడు సిద్ధాంతుల రావించి, పట్టమహిషి స్వప్నమును వివరించెను. జ్యోతిష్కులా స్వప్నము పుత్రలాభమును సూచించుచున్న దని నుడివిరి. శాక్యరాజ్య మంతయు సంతోషించెను.

మాయాదేవి గర్భవతి యయ్యెను. శుద్ధోదనుఁ డాసన్న ప్రసవ యైన పట్టమహిషిని యథోచిత పరివారము తోడు నిచ్చి పుట్టినింటికి సాగనంపెను. మార్గమధ్యమున మాయాదేవి లుంబినీవనమున నొక సరోవరతీరమున విడిసెను. సహజ

సౌందర్యవిలసితమైన యా లుంబినీవనములో సరోవర తీరమున ఫలాశవృక్షచ్ఛాయలో మాయాదేవి విశ్వకల్యాణమూర్తి యైన శిశువును బ్రసవించెను.

కపిలవస్తుపురమునఁ బుత్త్రోత్సవము నెల్లెడ ఘోషించెను. మంత్రులు రాజపరివారసమేతులై మత్తేభయూథములతో జవనాశ్వబృందములతో లుంబినీవనమున కేగి రాజశిశువు నంతఃపురమునకుఁ గొనివచ్చిరి.

బారసాలకు శాక్యరాజ్యమందలి పండితులు సామంతులు మండలాధిపు లెందఱో కపిలవస్తుపురికరుగుదెంచిరి. శుద్ధోదన మహారాజునకుఁ గానుకలుగా మాణిక్యరాసులు మత్తేభయూథ రథ తురగ కాంచనాంబరములు లభించెను. శాక్యరాజ పుత్త్రునకు విప్రులు సర్వార్థసిద్ధుడని నామకరణము చేసిరి. ఆ నామధేయమే కాలక్రమమున సిద్ధార్థుఁడని రూపాంతరము నందెను.

శాక్యరాజ్యమును రక్షించుటకు యువరాజవతరించెనని ప్రజలు సంతోషించిరి. శుద్ధోదన మహారాజునకుఁ బుత్త్రోదయము శాక్యరాజ్యమునకు మహోదయము. ఆ మహోత్సవమున కరుదెంచిన యసితమహర్షి, యతిలోకకోమలనయనద్యుతులచేఁ బ్రపంచచరిత్రలో నిత్యమహోదయము నెలయించిన యా రాజశిశువు నవలోకించి, యాతఁడు జగదుద్ధారకుఁడు కాఁగలఁడని శుద్ధోదను నభినందించి వీడ్కొని వెడలిపోయెను.

సిద్ధార్థుఁడు జన్మించిన సప్తమ దివసముననే మహామాయా దేవి కాలధర్మము నొందెను. పినతల్లి ప్రజావతీదేవి మిక్కిలి యనురాగముతో సిద్ధార్థుని పెంచసాగెను. శుద్ధోదనుఁడు సిద్ధార్థున కెనిమిదేండ్ల ప్రాయమున నుపనయనము గావించి విశ్వామిత్రుఁడను గురువున కప్పగించెను. అర్థశాస్త్రము, రాజ్యాంగతంత్రము నానావిధకళలు నేర్పుటకు సుప్రసిద్ధపండితుల నేర్పరచెను. సిద్ధార్థుఁడు ఖడ్గచాలనము, ధనుర్వేదము, రథగజతురగారోహణము, వ్యూహతంత్రము మున్నగు క్షత్రియరాజకుమారోచితవిద్యల నభ్యసించుచుండెను.

కోమలమనస్కుఁడైన సిద్ధార్థుని దయాస్వభావము చిన్నతనముననే యభివ్యక్తమయ్యెను. అశ్వారోహణమున, రథచోదనమున, ఖడ్గచాలనమున జరుగు పోటీలలో విద్యార్థులందఱు తమ యభినివేశమును జూపసలయును. ద్వంద్వయుద్ధమున దస్సిపోయిన ప్రత్యర్థిని గాంచి కరుణార్ద్రహృదయుఁడైన సిద్ధార్థుఁడు తానే యోటమిని వరించెడివాఁడు. ఒకసారి క్షత్రి రాకుమారులలో గుఱ్ఱపు పందెమున సిద్ధార్థుఁడు పాల్గొనెను. గురువులు, సామంతులు, రాజపరివారము, ప్రజలు పందెమును జూచుచుండిరి. రాజకుమారు లందఱు తమకమునఁ దమతమ గుఱ్ఱములఁ బరుగెత్తించిరి. సిద్ధార్థుని గుఱ్ఱమే యన్ని గుఱ్ఱములను మించి పరుగెత్తుచుండెను. కాని యతని [illegible] గుఱ్ఱమున [illegible] వేగతరముగ ముందునకుఁ బరుగెత్తినను నోట నురుగలు గ్రమ్ముచు నున్న మున్న గాని యుండ పరుగెత్తు

చున్న గుఱ్ఱమును జూడగనే సిద్ధార్థుని గుండె కరగి పోయినది. వెంటనే యతండు కళ్లెమును సడలించి గుఱ్ఱమును దిగి, జూలు నిమిరి, దాని యాయాసమును దీర్చసాగెను. ఆనాటి యువరాజు తన గెలుపును, యశస్సును రాజనీతిని భూతదయకుం గర్పూర హారతిగ సమర్పించి ధన్యుండయ్యెను.

ఉద్యానవనమున నొకనాడు సిద్ధార్థుండు విహరించు చుండెను. పూల తావులం జిమ్ము కమ్మతెమ్మెరల నానుచు యువరాజు చంద్రకాంత శిలావేదికపై నాసీనుండై యుండెను. సిద్ధార్థుని దయానురాగరసపరిప్లుతమైన హృదయమే యానాటి నూత్న వసంతసాయంసంధ్యారాగరంఛోళిలో విశ్వసమ్మోహన రూపమునం బ్రతిఫలించెను. ఆమని మలిసంజవెలుంగులో నాకాశమున హంసలు గుంపులుగా నెగుర సాగినవి. ఆనంద పారవశ్యమున సిద్ధార్థుని ధ్యానహృదయము నిదిధ్యాసలోం జిక్కినది. అంతలో వేదనా క్రేంకారముతో, రక్తసిక్తమైన రెక్కలతో నేలపైంబడి యొక రాజహంస కొట్టుకొనుచుండెను. సమీపమునంబడియున్న హంస మూలుగు వెలుగువిన్న సిద్ధార్థుడు మరుక్షణమున నారాజహంసను, దన చిరుకౌగిటం జేర్చుకొనెను. పక్షి రెక్కలో గుచ్చుకొనిన వాడి బాణమును దీసి యీకల నిమిరి గాయమునకుం గట్టు కట్టెను. ఆకాశమున స్వేచ్ఛగా సంచరించు నా హంసపై బాణమును బ్రయోగించు దుర్బుద్ధి యెవరికైన నేల కలుగవలెను? అది మృగయాలాలసత కాబోలు!

ఇతర ప్రాణికోటికి మృత్యువేదన కలిగించుటయే మానవులకు మధుర క్రీడా వినోదమా? భావనా వేగమున సిద్ధార్థుని గుండెలో నగ్ని సర్వలోకములు పెల్లుబ్బి క్రాల సాగినవి. కొంత బాధ యుపశమించ రాజహంస యువరాజు వడిలో నొదిగి ముడుచుకొని విశ్రమించినది. హంస గాయము చిరకాలముననే మానగలదు. కాని రాజపుత్రుని హృదయమున మానని గాయ మేర్పడినది. అప్పటినుండి సిద్ధార్థుని సుకుమారహృదయము విశ్వవేదనకు శాంతి నిల్పుకొని సానుభూతితో కొట్టుకొన సాగినది.

ఆసమయమున నా యుద్యానవనమునకొక పరిచారకుడు వచ్చి యా రాజహంస నివ్వవలెనని కోరెను. ఆ హంసను కొట్టినది దేవదత్తుడు. అతడే తన పరిచారకుని హంసకొరకు పంపెను. హంస నిచ్చుటకు సిద్ధార్థుడు నిరాకరించెను. దేవదత్తుడు శాక్యవంశ రాజపుత్రుడే. సోదర రాజకుమారుని కోరికను త్రోసిపుచ్చుట [illegible] యువరాజు వెనుకాడలేదు. వేటాడిన వారికే మృగయుడు కోరుకొనుట సర్వజనవేద్యమైన ధర్మము. దేవదత్తునకు సిద్ధార్థుని నిరాకృతి యర్థము కాలేదు. అతడు రాజసభలో యువరాజుపై నభియోగమును తెచ్చెను. శుద్ధోదన మహారాజు సింహాసనాగ్రమున నుండెను. శ్రుతిస్మృతి ధర్మనిష్ణాతులైన పండితులు, సామంతులు దండనాథులు ప్రభృతి జనముచే రాజసభ క్రిక్కిరిసియుండెను. దేవదత్తుని వాద మిది సాగినదే హంస రెక్కలలో గ్రుచ్చుకొన్న బాణము చివర గల దేవదత్తనామాక్షరములు ప్రత్యక్షసాక్ష్యము. ఇంక లక్ష్యము మృగయునికే చెందవలెను.

సిద్ధార్థుఁడు మందగంభీరస్వరమునఁ దన వాదమును రాజసభలో నివేదింప సాగెను. "రాజహంసను సంహరింపఁ దలఁచిన వాఁడు దేవదత్తుఁడు. గాయమునుమాన్పి సంరక్షించినవాఁడను నేను. హంస కతఁడు విరోధి. నేను హితుఁడను. విచారింపుఁడు. ఏ ప్రాణి నైనను జంపువాని కప్పగించుట ధర్మము కాదు. ప్రాణి రక్షకునకుఁ జెందవలెను గాని ఘాతుకునకుఁ జెందరాదు. ఇది మృగయాధర్మమున కతీతమైన పరమ ధర్మము. హింసాచరణమునకే సర్వస్వత్వములను గట్టిపెట్టినచో నీ భూతధాత్రి కది నిత్యమహాప్రళయము." యనరాజు మాటలకు రాజసభ నిస్తబ్ధమైనది. సిద్ధార్థుఁడు, తిరిగి, "మృగయా ధర్మమునే పాటింప వలెనన్నను రాజహంస దేవదత్తునకుఁ జెందదు. బ్రతికిన ప్రాణులెల్ల వేటకానివి గావు. చచ్చిన కళేబరములు మాత్రమే మృగయుఁడు సంపాదించుకొనవచ్చును. రాజహంసను దేవదత్తుఁడు చంపలేదు. గమనశక్తిని మాత్రమే హరించినాఁడు. పెద్దలు ధర్మ నిర్ణయము సలుప గోరుచున్నాను" అని పలికెను. రాజసభ యంతయు లోకోత్తరకృపామూర్తియైన సిద్ధార్థుని వాదమును ప్రశంసించుచు జయ జయ ధ్వానములు సలిపెను. రాజహంస రక్షకుఁడైన సిద్ధార్థునిదే యని మహారాజు తీర్పు చెప్పెను. సిద్ధార్థుని విజయము సమస్తభూతకోటికి దిగ్విజయమయ్యెను. ఆ యమృతహృదయుని యనురాగహస్తముల యూతగొని యా రాజహంస యనంతవిహాయసపథముబట్టి యెదో క్రొత్త క్షితిజము వైపున కెగిరి పోయెను.

సిద్ధార్థుని నిర్వ్యాజనిసర్గదయాస్వభావము శుద్ధోదన మహారాజును కలవర పెట్టినది. దుష్టశిక్షణము శిష్టరక్షణమును జేయవలసిన రాజులకు సున్నితపు గుండె పనికి రాదు. ప్రపంచములో నెచ్చట బాధ కన్పించినను, సిద్ధార్థుని హృదయము కరగి పోవును. కావున యువరాజును రాజహర్మ్యమును దాటి పోనీయక, మహారాజు రహస్యముగ సంరక్షించుకొనుచుండెను. వయోవృద్ధులు, వికలాంగులు, వ్యాధిగ్రస్తులు యువరాజున కగపడకుండ జూడవలెనని భటులకు రాజశాసనము. సాయంసంధ్యాసమయములందు మహారాజు స్వయముగ యువరాజును వెంట నిడుకొని యశ్వారూఢుడై సపరివారముగ వాహ్యాళి కేగుచుండెడివాడు.

ఒకనాడు రోహిణీనదీతీరమున నొక యద్భుత సన్నివేశము సిద్ధార్థుని హృదయమును దీవ్రముగఁ గలవరపెట్టినది. ఒక తీతువు నీటిలోనుండి నిస్సంకోచముగ నొక చేపను బట్టుకొని సద్యోవేగమున మింటికెగసెను. ఎగురుచున్న యాతీతువును డేగ తన్నుకొని పోయెను. సిద్ధార్థుని మనస్సు నిదిధ్యాసలోఁ జిక్కెను. అతని మానోనేత్రము ముందు విశ్వసృష్టి విచిత్ర విభ్రమము సాక్షాత్కరించెను. చిరుచేపల మ్రింగుచున్న కప్పను పాము కబళించెను. ఆ పామును గ్రద్ద తన్నుకొని పోయెను. ఒక మహారణ్యము—సింహగర్జన : లేడిపిల్లలు పచ్చని మాపులలోఁ జిచ్చి గంతులు పెట్టుచున్నవి. సింహము లేడిపిల్లలఁ బట్టి పొట్టఁబెట్టుకొనుచున్నది. సృష్టిలోఁగల పరస్పరవైరుధ్యము పారి

సిద్ధార్థుఁడు మందగంభీరస్వరమునఁ దన వాదమును రాజసభలో నివేదింప సాగెను. "రాజహంసను సంహరింపఁ దలఁచిన వాఁడు దేవదత్తుఁడు. గాయమునుమాన్పి సంరక్షించిన వాఁడను నేను. హంస కతఁడు విరోధి. నేను హితుఁడను. హింసాపాపము. ఏ ప్రాణి నైనను జంపువాని కప్పగించుట ధర్మము కాదు. ప్రాణి రక్షకునకుఁ జెందవలెను గాని ఘాతుకునకుఁ జెందరాదు. ఇది మృగయాధర్మమున కతీతమైన పరమ ధర్మము. హింసాచరణమునకే సర్వస్వాత్వములను గట్టి పెట్టినచో నీ భూతధాత్రి కది నిత్యమహాప్రళయము." యువరాజు మాటలకు రాజసభ నిస్తబ్ధ మైనది. సిద్ధార్థుఁడు, తిరిగి, "మృగయా ధర్మము నే పాటింప వలెనన్నను రాజహంస దేవదత్తునకుఁ జెందదు. బ్రతికిన ప్రాణు లెల్ల వేటకానివి గావు. చచ్చిన కళేబరములు మాత్రమే మృగయుఁడు సంపాదించుకొనవచ్చును. రాజహంసను దేవదత్తుఁడు చంపలేదు. గమనశక్తిని మాత్రమే హరించినాఁడు. పెద్దలు ధర్మ నిర్ణయము సలుప గోరుచున్నాను" అని పలికెను. రాజసభ యంతయు లోకోత్తరకృపామూర్తి యైన సిద్ధార్థుని వాదమును ప్రశంసించుచు జయ జయ ధ్వానములు సలిపెను. రాజహంస రక్షకుఁడైన సిద్ధార్థునిదే యని మహారాజు తీర్పు చెప్పెను. సిద్ధార్థుని విజయము సమస్తభూతకోటికి దిగ్విజయము మయ్యెను. ఆ యమృతహృదయుని యనురాగహస్తముల యూతగొని యా రాజహంస యనంతవిహాయసపథముబట్టి యెదో క్రొత్త క్షితిజము వైపున కెగిరి పోయెను.

కోటుల స్వార్థపరమైన వెట్టిపొంగులు—మరేవో యాలోచనలు సిద్ధార్థుని మనస్సును వేధించి జీవిత రహస్య గవేషణాకై ప్రేరేపించినవి. రోహిణీనిర్ఝరిణీతరంగమధుర నినాద మతని కిక విశ్వవేదనారావమై వినిపింప సాగినది. పరిధ్యాన నిమగ్నుడైన యువరాజును శౌద్ధోదని మహారాజంతఃపురమును జేరెను. మననశీలుడైన పుత్రుని, హృదయమును గలవరపెట్టు దృశ్యముల నుండి దూరముగ నుంచుటకు మహారాజు సమస్త యత్నముల నొనరింప సాగెను.

సిద్ధార్థునకు యౌవనోదయ మైనది. ఉపాధ్యాయులనుండి యనేక విద్యల నభ్యసించియున్నాడు. గురుదక్షిణల స్వీకరించి యుపాధ్యాయులు మహారాజు సమక్షమున సిద్ధార్థుని దీవించి, యుక్తవయస్కుడైన యతని కిక వివాహయత్నము కావింప వచ్చునని ప్రవచించిరి. మహారాజు సంతోషమునకు మేర లేదు. యుక్తవయస్కుడు, విద్యాసంపన్నుడునైన సిద్ధార్థుని మనస్సులో భోగలాలసత, యధికారతృష్ణ, పరరాజ్య విజిగీష ప్రబలలేదు. సుప్తరాగాతిరేకమునుగూడ విజృంభింప జేయు సౌందర్యరాశియైన రాజకన్యను వెదకి సిద్ధార్థునకు వివాహము చేయుట సర్వదా శ్రేయస్కరమని మహారాజు తలపోసెను.

కన్యావరణమున శాక్యరాజ్యమున సనాతనసంప్రదాయ మొకటికలదు. చైత్రశుద్ధదశమినాడు రాజ్యము నందలి సకల క్షత్రియ కన్యక లంతఃపురమున కరుదెంచి యువరాజునకు పారితోషికముల నందుకొని పోవలెను. ఆనాడు, క్షత్రియ కన్య

కలు స్త్రీయు సౌందర్య ప్రదర్శన మొనర్చుచు యువరాజు నలరించు చున్న కానుకలం గైకొని పోవుచుండిరి. సిద్ధార్థుడు నిశ్చల మన స్కుడై యుండెను. చిట్టచివరకు, సుప్రబుద్ధుం డను మహామండ లాధిపుని పుత్రిక యశోధరా నామాన్వితకన్య చేరువన భూషితయై నొయ్యార మొలికించుచు సిద్ధార్థుని సమీపమున నిలువబడి, చిన్నారి చిరునవ్వు లొలుకుచుం దన రాక సూచించు టకు "ప్రభూ!" యని సంబోధించెను. అప్పటికే యువరాజు తనదగ్గఱ గల పారితోషికము లెల్ల నిచ్చివేసెను. కాని, యశో ధర సంబోధన వినుటతోడనే పులకించి పోయిన సిద్ధార్థుడు ప్రాక్తనుల తెలుపు తెల్లవాఱ జిమ్ముచుం దన కంఠ మందలి మరకత మణిహారమును తీసి యామె కంఠమున వేసెను. సభలో హర్షధ్వనులు చెలరేగెను. పసిడి సిగ్గు దొంతరలు క్రమ్ముకొన యశోధర తలవంచుకొన్నదై మందగమనమున నరలిపోయెను. శుద్ధోదన మహారాజు సంతోషపరవశుం డయ్యెను.

సుప్రబుద్ధు నొద్దకు శుద్ధోదన మహారాజు యువరాజు కొఱకు యశోధరాకన్య నర్థించుచు దూతల నంపెను. కన్యక నర్థించు రాజకుమారుడు కన్యాస్వయంవరోత్సవమునందు నెగ్గవలెను, తదుపరి విద్యాప్రదర్శనమున నగ్రేసరుడై ప్రకాశించవ లెను. ఆ యాచారము ననుసరించి యశోధరా స్వయంవరమును ప్రకటించి సుప్రబుద్ధుడు సిద్ధార్థు నాహ్వానించెను. ఆ మహోత్ సవమునకు శాక్యవంశరాజకుమారు లెందఱో వచ్చిరి. అందు దేవదత్తుడు, అర్జునుడు, ఆనందుడు కూడ గలరు. విలు

విద్యలో దేవదత్తుఁడు, ఖడ్గ చాలనమున నానందుఁడును సుప్రసిద్ధులు. పటాటోపపరాఙ్ముఖుఁడైన సిద్ధార్థుని యభినివేశము సన్నిహితులకుఁ దప్ప లోకమున కింతగాఁ దెలియదు.

స్వయంవరరంగమున మత్స్యయంత్రములు పెక్కు గలవు. అర్జునుఁడు రంగమునఁ బ్రవేశించి, యంత్రము నాగ గవాక్షముల నెత్తున నుంచ మనెను. ఆనందుఁడు నట్లే గోరుకొనెను. దేవదత్తుఁడు తన యంత్రము సప్త గవాక్షోర్ధ్వస్థానమును గావింప మనెను. సిద్ధార్థుఁడు తన యంత్రమును బది గవాక్షముల యెత్తున నమర్చ మనెను. దేవదత్తాదులు తమ యంత్రముల నేసి సభాసదుల కుల్లాసము గలిగించిరి. సిద్ధార్థుఁడు, యంత్రాగారమున నున్న విల్లు నెత్తి యల్లెత్రాడు బిగించి, యెక్కుపెట్ట సాగెను. కాని, యాతని గాఢాకర్షణమున కా కార్ముకము తుత్తునియలై నేలఁగూలెను. సభాసదులందఱాశ్చర్యచకితులైరి. అంత, యువరాజు, "ఈ దుర్బలకార్ముకము లేల? ఆయుధాగారమున నున్న 'సింహహాను' ధనుస్సును దెమ్మ"ని పరిజనుల కాజ్ఞాపించెను. సేవకులు సింహహాను చాపమును దెచ్చి యిచ్చిరి. సిద్ధార్థుఁడు, ధనుష్టంకార మొనర్చి జవలాఘవసమన్వితహస్తుఁడై లక్ష్యశుద్ధితో మత్స్యయంత్రము నేలఁగూల్చెను. అనన్యసామాన్యమైన సిద్ధార్థుని కార్ముకకౌశలమును సభ్యులందఱు ప్రశంసించిరి. యశోధరాకుమారి పులకాంకురపరిభరితశరీరముతో నానంద తన్మయత్వమున లీనమైనది.

తరువాత ఖడ్గవిద్యా ప్రదర్శనము. రంగమున సమాన పరిమాణములు గల వృక్షములు వరుసలుగా నుండెను. రాజ

కుమారులు వృక్షముల ఖడ్గములతో ఛేదింపసాగెను. దేవదత్తుఁడొక వృక్షమును షడంగుళ దఘ్నముగ నరికెను. అర్జునుఁడు సప్తాంగుళ దఘ్నముగ నరికెను. నందుఁడు నవాంగుళదఘ్నముగ ఛేదింపఁగల్గెను. సిద్ధార్థుఁడు లేచి, యొక్క వ్రేటున వృక్షద్వయముపై ఖడ్గమును ప్రయోగించెను. ఖడ్గము మిరుమిట్లను గొల్పుచు మెరసెను. అంతియే. వృక్షము లెప్పటియట్లు నిలిచియున్నవి. నందుఁడు యువరాజు లక్ష్యము చెదరిన దని కేక వేసెను. యశోధర గుండె ఝల్లు మన్నది. సిద్ధార్థుఁడు నవ్వుచు సేవకుల నియోగించి చెట్లను ఒడ ద్రోయించెను. కాండములయందు ఖడ్గకృత్తరేఖలు సుస్పష్టముగ సభ్యులకు గోచరింప సంభ్రమాశ్చర్య సంభృతులై యొక్కపెట్టున జయ జయ ధ్వానములు సల్పిరి. యశోధర మందగంభీరగమనమున జెలికత్తెలతో నేతెంచి, సిద్ధార్థుని కంఠమున సుమపుష్పమాల నలంకరించెను.

యశోధరాసిద్ధార్థులవివాహము మహోన్నతవైభవముగా జరిగినది. శుద్ధోదన మహారాజు సూక్ష్మనిపుణులగు చంద్రశాలామయ హర్మ్యమును నిర్మించెను. హంసతూలికా తల్పములు, కాంచన మణి మయాంబరములు, తారహారములు, కస్తూరికా చందన పరిమళ ద్రవ్యములు, సరోవరోద్యానవిహార వాటికలు, సంగీత నాట్య వినోదములు, శృంగారవేశ్యా పరిచారికా బృందము- సమస్త భోగములు సిద్ధార్థునకు శుద్ధోదన మహారాజు ప్రత్యేక శ్రద్ధతోఁ గల్పించెను. లావణ్య మహాగరిష్ఠయైన యశోధర సిద్ధార్థునకు సహధర్మచారిణియై కొలుచుచుండెను. అఖిలలోక

సౌందర్యరాశియైన యశోధరా సాహచర్యమున సిద్ధార్థుఁడు ప్రవృత్తి పథమునఁ బడగలఁడని మహారాజాశించుచుండెను. సిద్ధార్థుఁడు యశోధరను మిక్కిలి ప్రేమతో మన్నించుచుండెడివాఁడు. కొడుకును గోడలినిఁ జూచి శుద్ధోదన మహారాజు మురిసిపోవుచుండెడివాఁడు. రాజభోగవిలాసములలో యశోధరాదేవి నవయౌవనసౌందర్యవిభ్రమములలో, సిద్ధార్థుని మనస్సు కలుగలేదు. భోగపరాఙ్ముఖమైన యతని నేత్రాంచలములలో నిదిధ్యాస నీడలు గట్టుచునే యున్నది.

యశోధర గర్భము దాల్చెను. అంతఃపురమున మహోత్సవము జరిగినది. సిద్ధార్థునిలో ధ్యాననిమగ్నతయే గాని యుత్సాహాతిరేకము కనుపించలేదు. శుద్ధోదన మహారాజు హృదయము చివుక్కుమనెను. మహారాజేమి చేయఁగలఁడు? జరారుజామరణములు యువరాజు కంటఁ బడకుండఁ గట్టడి చేసి యుంచెను.

ఒకనాఁ డంతఃపురమున నెరసిన వెంట్రుకలు, ముడతలు పడిన శరీరము, వ్రాలిన కనుబొమలు గల యొక ముదివగ్గు దగ్గుచు నూతకోలతో నడువలేక నడువలేక నడుచుచుండెను. సిద్ధార్థుఁ డతని జూచి ఖిన్నుఁ డయ్యెను. అతఁడు రాజసౌధ పరిసరములఁ గాన్పించని వేఱొక వాస్తవలోక మున్నదని గ్రహించెను. గ్రంథములయందు సిద్ధార్థుఁడట్టి లోకమును గూర్చి యిదివరకే తెలిసికొనియుండెను. అతనికీ రాజభోగము లన్నియు నదృశ్య సువర్ణ శృంఖలములుగ గోచరించినవి. అతని

మహాప్రాసాదమే యొకవిచిత్ర కారాగారముగఁగన్పట్టెను. వెంటనే యతఁడశ్వశాలకుఁ బోయి తన గుఱ్ఱము నెక్కి విశాలప్రపంచమును దిలకింప నుద్యుక్తుఁ డయ్యెను. కాని యశ్వారూఢుఁడైన సిద్ధార్థుని గాంచి ద్వారపాలకులు ప్రత్యుత్థానము సల్పి యవనత మస్తకులై నిల్చిరే కాని తలుపులు తెరువరేమి? అది రాజాజ్ఞ! యువరాజు సపరివారముగ బయలు దేరవలెనే గాని, యొంటరిగాఁ బోరాదు. పారతంత్ర్యము యువరాజు ముఖమును దేరి పారఁ జూచినది. అతఁడు గుఱ్ఱమును మరలించుకొని మహారాజు సమక్షమునకుఁ బోయెను.

సిద్ధార్థుఁడు యథేచ్ఛగ విహరింప గోరి మహారాజు ననుజ్ఞ వేఁడెను. శుద్ధోదనుఁడు వేడి నిట్టూర్పు విడిచెను. యువరాజు కోరికను మహారాజెప్పుడును నిరాకరించి యుండలేదు. ఈ విపరీతవాంఛ యతని కేల పుట్టవలెను? పురమున నేమి చూడవలెను? ఒకవేళ చూడవలెననిన వైభవముతో సపరివారముగఁ బోవచ్చునే? వేదాంతులనే కలవరపెట్టు లోకమును సుకుమార మనస్వియైన సిద్ధార్థుఁడు నగ్నముగ దర్శింపఁ గలఁడా? అనేక భావములు మహారాజు మనస్సును వేధించినవి. కాని, పుత్రుని కోరికను నిరాకరింపలేక సిద్ధార్థునితో, "తండ్రీ! నీయిష్టమే నా యభీష్టము. అట్లే విహరింపుము. నీ స్వాతంత్ర్యమున కంతరాయము లున్నవని తలపకుము. అవి రాజమర్యాదలు. ఐనను, నీ యిష్టము చొప్పున వర్తింపుము"ని భగవంతునిపై భారము వైచి, మందస్వరమున మహారాజు పలికెను. కాని యతని హృదయమున నగ్నిపర్వతములు పొగలు గ్రమ్ముకొన సాగినవి.

సౌందర్యరాశియైన యశోధరా సాహచర్యమున సిద్ధార్థుఁడు ప్రవృత్తి పథమున నడగలఁడని మహారా జాశించు చుండెను. సిద్ధార్థుఁడు యశోధరను మిక్కిలి ప్రేమతో మన్నించు చుండెడి వాఁడు. కొడుకును కోడలినిఁ జూచి శుద్ధోదన మహారాజు మురిసి పోవు చుండెడివాఁడు. రాజభోగవిలాసములలో యశోధరాదేవి నవయౌవనసౌందర్యవిభ్రమములలో, సిద్ధార్థునకు వైముఖ్య కలుగ లేదు. భోగపరాఙ్ముఖమైన యతని నేత్రాంచలములలో నిదిధ్యాస నీడలు కట్టుచునే యున్నవి.

యశోధర గర్భము దాల్చెను. అంతఃపురమున మహోత్సవము జరిగినది. సిద్ధార్థునిలో ధ్యాననిమగ్నతయే గాని యుత్సాహాతిరేకము కనుపించలేదు. శుద్ధోదన మహారాజు హృదయము చివుక్కు మనెను. మహారా జేమి చేయఁగలఁడు ? జరా రుజా మరణములు యువరాజు కంటఁ బడకుండఁ గట్టడి చేసి యుంచెను.

ఒకనా డంతఃపురమున నెరసిన వెండ్రుకలు, ముడతలు పడిన శరీరము, వాలిన కనుబొమలు గల యొక ముదివగ్గు దగ్గుచు నూత కోలతో నడువలేక నడువలేక నడుచు చుండెను. సిద్ధార్థుఁ డతని జూచి ఖిన్నుఁ డయ్యెను. అతఁడు రాజసౌధ పరిసరములఁ గానరాని వేఱొక వాస్తవలోక మున్నదని గ్రహించెను. గ్రంథములయందు సిద్ధార్థుఁడట్టి లోకమును గూర్చి యిదివఱకే తెలిసికొనియుండెను. అతనికి రాజభోగము లన్నియు నదృశ్య సువర్ణ శృంఖలములుగ గోచరించినవి. అతని

మహాప్రాసాదమే యొకవిచిత్రకారాగారముగఁగన్పట్టెను. వెంటనే యతఁడశ్వశాలకుఁ బోయి తన గుఱ్ఱము నెక్కి విశాలప్రపంచ మును దిలకింప నుద్యుక్తుఁ డయ్యెను. కాని యశ్వారూఢుఁడైన సిద్ధార్థుని గాంచి ద్వారపాలకులు ప్రత్యుత్థానము సల్పి యవనత మస్తకులై నిల్చిరే కాని తలుపులు తెరువరేమి? అది రాజాజ్ఞ! యువరాజు సపరివారముగ బయలుదేరవలెనే గాని, యొంటరిగాఁ బోరాదు. పారతంత్ర్యము యువరాజు ముఖమును దేరి పారఁజూచినది. అతఁడు గుఱ్ఱమును మరలించుకొని మహారాజు సమక్షమునకుఁ బోయెను.

సిద్ధార్థుఁడు యథేచ్ఛగ విహరింప గోరి మహారాజు నను జ్ఞ వేడెను. శుద్ధోదనుఁడు వేడి నిట్టూర్పు విడిచెను. యువరాజు కోరికను మహారాజెప్పుడును నిరాకరించి యుండలేదు. ఈ విప రీతవాంఛ యతని కేల పుట్టవలెను? పురమున నేమి చూడవ లెను? ఒకవేళ చూడవలె ననిన వైభవముతో సపరివారముగఁ బోవచ్చునే? వేదాంతులనే కలవరపెట్టు లోకమును సుకుమార మనస్వియైన సిద్ధార్థుఁడు నగ్నముగ దర్శింపఁ గలఁడా? అనేక భావములు మహారాజు మనస్సును వేధించినవి. కాని, పుత్రుని కోరికను నిరాకరింపలేక సిద్ధార్థునితో, "తండ్రీ! నీయిష్టమే నా యభీష్టము. అట్లే విహరింపుము. నీ స్వాతంత్ర్యమున కంతరా యము లున్నవని తలపకుము. అవి రాజమర్యాదలు. ఐనను, నీ యిష్టము చొప్పున వర్తింపుము"ని భగవంతునిపై భారము వైచి, మందస్వరమున మహారాజు పలికెను. కాని యతని హృదయమున నగ్నిపర్వతములు పొగలు గ్రమ్ముకొన సాగినవి.

నాటి మధ్యాహ్నమునసే సిద్ధార్థుఁడు చెన్నుఁడను పరి చారకునితోఁ గలసి, ప్రచ్ఛన్న వేషమున రాజసౌధమును వీడి నగరము లోనికి కరిగెను. సిద్ధార్థున కది యొక క్రొత్త ప్రపంచమును వలెఁ బొడఁగట్టసాగెను. వివిధ వీథులలో గుమిగూడిన ప్రజా సమూహమును గాంచెను. రాజకుమారు లందలంబుల నెక్కి విహరించుచుండిరి. నిరుపేద లందలంబుల మోయుచు, స్వేద బిందువు లొలుకుచు నొదిగి నిలుచుచుండిరి. విక్రయక్రియాదక్షు లైన వర్తకుల వచోనైపుణ్యము, వస్తుసంచయసంపాదనాభి రక్తులైన ప్రజల వాంఛానైవిధ్యము, నేతగాండ్రి మగ్గముల చప్పుడు, పిండివాండ్ర తిరుగళ్ల మ్రోత, కుండలు దీయు కుమ్మరి సారె, కాలిన యినుమును సాగదీయు కమ్మరి సమ్మెట పోటులు, కంచరి సుత్తి రొదలు, మూగిన ప్రజల రంజింపఁజేసెడి వినోద కారుల హస్తలాఘవము, దుర్గంధపూరితములైన యంగడి రచ్చలు, సందు గొందులలో నిరుకుకొనిన పూరిగుడిసెలు, రాచబాటలలో విచ్చలవిడిగా విహరించు ధనికుల దురహంకా రములు — సిద్ధార్థునకు వింతగనే సాక్షాత్కరించెను.

తరువాత సిద్ధార్థుఁ డొక దేవాలయమును సందర్శించెను. పరదేశాగతుఁడైన భర్త యాగమనము నాకాంక్షించి దేవుని పూజించు వధువు, సంతానార్థియై దేవునకు మొక్కుకొను మఱొక పడతి, చేసిన పాపములు శమించుటకై ముడుపులు చెల్లించుకొను భక్తుఁడు, సంకల్పించిన వర్తకము నిర్విఘ్నముగఁ గొనసాగుటకు మంత్రపుష్పములు చదివించు వ్యాపారి—యిట్టి వారెందఱో యచటఁ గూడియుండిరి. అర్చకులు దేవునకుఁ

బ్రతినిధులై భక్తుల ముఖముల నందుకొనుచుండిరి. దేవుని పేరు మీద సాగుచున్న వ్యాపారము, వ్యాపించుచున్న పదార్థ్యము, ప్రబలుచున్న యజ్ఞాన కాపట్యము సిద్ధార్థునకు హృదయ విదారకముగఁ దోచెను.

సిద్ధార్థుఁడు చెన్నునితోఁ గలిసి పురమంతయుఁ గలయఁ దిరిగి చివరకు రోహిణీనదీ తీరమును జేరెను. అచట శిథిలాంగుఁడైన రుజార్తుని దైన్యవికలధ్వని వినిపించెను. సిద్ధార్థుఁడు వెంటనే యతనిఁజేరి యొడిలోఁ బొదివికొనెను. శరీర మంతయు వ్రణములచే నిండి చీము గారుచుండెను కాలు చేతులు వంకరలు దిరిగి పట్టు సడలి యుండెను. అతని తల నిమిరి, సిద్ధార్థుఁడు, "నీ కెచ్చట నొప్పిగా నున్నద"ని ప్రశ్నించెను. రోగి వణకుచు, "అయ్యా! నా దేహమున నొప్పిలేని చోటు లేదు." అని పలుకుచు గ్రుడ్లు తేలవేయసాగెను. చెన్నుఁడు "ప్రభూ! యిది యొక యంటు వ్యాధి. ఇతఁడు రేపో మాపో మరణింపగలఁడు. ఇఁక లాభము లేదు. మీ రితని స్పృశించుట మంచిదికాదు" అని యువరాజును వారింపసాగెను. సిద్ధార్థుఁడు రోగి నిల్లు చేర్చి మరలి వచ్చుచుండగాఁ గొందఱొక మృతకళేబరమును శ్మశానమునకుఁ గొంపోవుచుండిరి. బంధువుల శోకాలాపములు, చుట్టు నున్న వారి భగవన్నామసంకీర్తనము సిద్ధార్థుని గలఁచి వైచినవి. అనతి దూరమునఁగల శ్మశానవాటికలో శవమునకు దహనసంస్కార మొనర్చి వారు మరలి పోయిరి. జీవయాత్రకుఁ జిట్టచివరి గమ్యము శ్మశానమేనా? సిద్ధార్థుని గుండెలో నారని చిచ్చు

ప్రజ్వరిల్ల సాగెను. అతని మనోవ్యథ నర్థము చేసికొనిన ఛెన్నుఁడు మెల్లగ నతనిఁ దోడ్కొని యంతఃపుర సౌధమును జేర్చెను.

ఆ నాటి రాత్రి సిద్ధార్థునకు నిదుర పట్టలేదు. అతఁడు తన మనస్సంక్షోభము వలనఁ దండ్రికిఁ గూడ బాధకలిగింప కుండు టకు నిత్యక్రమానుసారము నాట్యమందిరమున కేగెను. రత్నదీ పాంకుర పరిబారాగపంక్తులు, కర్పూర సుగంధ ధూపములు, ఘనసారసిహారానులేపములు, కస్తూరికా తాంబూలములు యువ రాజు మనోనుతాపమును మఱింత వృద్ధి చేసినవి. రాజ నర్తకి శింజనీకింకిణీరావములలో సాయంకాలమున రోగిముఖమున వెలువడిన వికటహీనస్వరములే వినిపింప సాగినవి. అతఁడు మెల్లగ స్వీయహార్మ్యమును జేరుకొనెను.

ప్రచ్ఛన్న వేషములు దాల్చి సిద్ధార్థుఁడు రాజ్యమునం దెల్లెడ స్వేచ్ఛావిహార మొనర్చెను. ఎల్లెడల, హింస, క్రౌర్యము, దౌర్జన్యము, దురహంభావము, విద్రోహము లోకములో వికటాట్టహాసవిలయతాండవము సల్పుచున్న ట్లతనికి గోచ రించెను.

జాతరులు, కొలువులు, యజ్ఞములు, నోరులేని జంతువు లను హింసించు బలిపీఠములుగా మారినవి. క్షాత్రధర్మము ప్రకారము ప్రతిరాజు పొరుగు రాజుల సంహరించి యశ్వమేధ యాగమును నిర్వర్తించి చక్రవర్తి యగుటయే పరమార్థ మని

భావింప వలెను. ప్రజ లందఱు రాజునకు దాసులు. సామంతులు గూడ రాజపాదపీఠికపై నెన్నుదురు సోక నమస్కరింపవలెను. దుష్టసామ్రాజ్యవాంఛ మహారాజపురుషలక్షణమా ? మానవ సహజమా? పిశాచభావమా? తానేల యీ హింసాప్రవృత్తిని ప్రతిఘటించి నిలువరాదు ? సిద్ధార్థుని మనస్సులో స్థిరసౌదామినివోలె లోకకల్యాణభావము వెలుఁగొంద సాగినది. ఇంత వఱకు శాక్యయువరాజలాంఛనమైన కిరీట మతని కిఁక పాద పీఠికగా మారిపోయినది.

ఆ సమయమున యశోధరాదేవి పుత్రునిఁగన్న శుభవర్తమాన మొక వృద్ధదాసి యువరాజునకు నివేదించినది. అతఁడామెకు మెడలోని ముత్యాలహారము చిరునవ్వు లొలుకుచు బహూకరించి సన్మానించి పంపెను. "ఇది ఛేదింప వలసిన మఱియొక క్రొత్తబంధము కాబోలు ?" ననుభావము మెరపు తీగవలె మిరుమిట్లు గొలిపినది. కాని, సిద్ధార్థుఁ డిదివఱకే కృతనిశ్చయుఁ డయ్యెను.

రాజ శిశువునకు రోహిలుఁ డను నామకరణము చేయఁబడినది. సిద్ధార్థుఁ డుత్సాహిగాయె యుండెను. బారసాల మహోత్సవముగ జరిగినది. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు మానవ జీవితమును నరక కూపముగఁ జేయుచున్నవి. దురహంకారము, క్రూరత్వము, ద్రోహచింతనములతో మానవుఁ డెండమావుల వెంబడించి వెఱ్ఱి పరుగులు పెట్టుచున్నాఁడు. ద్వంద్వబద్ధమైన ప్రాణికోటికి సౌఖ్య మెక్కడిది ? మానవ

దుఃఖము నంత మొందించు మార్గము నన్వేషించుటయే జీవిత పరమార్థమని సిద్ధార్థుఁడు గుర్తింపఁ గలిగెను. జీవితమున నా నందయోగము సాధించుటకుఁ గృతనిశ్చయుఁడైన సిద్ధార్థుని జ్యోతిర్నయనములలో నుత్సాహరేఖలు తాండవింప సాగినవి. తన స్థిర సంకల్పమును దెలిసికొనినఁ దనతోడిదే లోకమని నమ్మియున్న పితృదేవుఁ డే మగునో ? భర్తృప్రాణయోప జీవిని యశోధర, చిన్నారిచిట్టి పాపాయి—వారిగతి యేమి కావ లెను ? ఈతలపు లతని కాళ్ళ కదృశ్య శృంఖలములు కాఁగలవు. అది వృథాశంకలకు సమయము కాదు.

సూర్యుఁ డస్తమించెను. పుత్రోత్సవ సందర్భమున వెలి గించిన జ్వాలాతోరణము లంతఃపుర హర్మ్యపరంపరలపైఁ బ్రకాశించు చున్నవి. సిద్ధార్థుఁడు చెన్నునిఁ బిలిచి, యశ్వమును సిద్ధముచేయ నియోగించి, తన సౌధమున కేగెను.

మిణుకు మిణుకుల యలతి వెలుఁగులు చిమ్ముచున్న చుక్కలు చిమ్మచీకఁటిని జీల్చుకొని మింటఁ దోచినవి. చెన్నుఁడు గుఱ్ఱమును యువరాజహర్మ్యప్రాంగణమున నిలిపెను. అశ్వ హేషారవము హంసతూలికా తల్పమున నున్న సిద్ధార్థు నాహ్వా నించినది. గగుర్పాటుతో సిద్ధార్థుఁడు లేచి నిల్చి ముందునకు సాగెను. యశోధర నిద్రించు చున్నది. రత్నదీపాంకురప్రభా రాగ పంక్తులు రాహులుని పెదవులపై బోసినవ్వులతోఁ గలసి పోయి సిద్ధార్థుని గుండెతో దోబూచు లాడసాగినవి. అతఁ

డనుఁగు పాపాయి కెమ్మోవిపైఁ గడసారి ముద్దు పెట్టుకొన బోయి ముందునకు సాగక నిలిచి, క్షణములో వెనుదిరిగి మేడ మెట్లు దిగసాగెను.

విశ్వకళ్యాణగవేషణ యారంభ మయ్యెను. సృష్ట్యాది నుండి, యే మానవుఁ డిట్టి లోకోత్తరపవిత్రయాత్ర సలుప లేదు. ప్రపంచచరిత్రలో సిద్ధార్థుని నిర్గమన మనన్యమై వెలిసినది. అతఁ డశ్వము నధిరోహించెను. ఆ పవిత్రశుభముహూర్తమును దలఁచుకొని మూడుకాలములు రోమాంచము వహించును. చెన్నఁడు స్వామి ననుసరించెను. కాలపురుషుని కటిక యెడఁద తొలిసారి కదలి, సిద్ధార్థుని గుఱ్ఱపు గిట్టల చప్పుడునకు శ్రుతి కల్పుకొని కొట్టుకొన సాగెను.

ఆ నడిరేయి సిద్ధార్థుఁ డశ్వారూఢుఁడై పయనించెను. మాగధరాజ్యకాననపరిసరములఁ జేపు సరికి ముసి ముసి చీఁకటులు చెదరి తెల్లవార సాగెను. సిద్ధార్థుఁ డచట గుఱ్ఱమును దిగి నవ రత్నఖచిత ఖడ్గమును శుద్ధోదన మహారాజునకు సమర్పింప మని చెన్నున కొసఁగి, తన భూషణముల నెల్ల నొలిచి యతని కొసగెను. చెన్నుఁ డశ్రుపూరితనయనుఁడై మౌనమును దాల్చి యుండెను. సిద్ధార్థుఁడు పీతాంబరములు వీడి, కాషాయవస్త్రముల ధరించి చూచు చుండగనే సన్న్యాసరూపమునఁ జెన్నుని వీడ్కొని తరలిపోయెను.

సన్న్యాసాశ్రమమును స్వీకరించిన పిమ్మట సిద్ధార్థుఁ డనూపియా తోటలో నొక వార ముండెను. పిమ్మట మగధరాజధాని రాజగృహము చేరుకొనెను. రాజగృహ మొక గిరిదుర్గము. రాజప్రాసాదములతో నుద్యాన వనములతో నాకరము మిక్కిలి మనోజ్ఞమై యుండెను. రాజ గృహమునకుఁ దూర్పున రత్నగిరి కలదు. రత్నగిరి గుహాభ్యంతరములు తపో దీక్షతో నుండెడి యోగుల కావాసములు. అచ్చట నున్న యాలారుఁడు, నుద్దాలకుఁడు మున్నగు సుప్రసిద్ధబ్రాహ్మణయతులయొద్ద యోగశాస్త్రవిద్యల నభ్యసించుటకు దేశ దేశములనుండి శిష్యులే తెంచు చుండిరి.

సిద్ధార్థుఁ డొక వివిక్తగుహాయందు వసించుచు నారు సంవత్సరములు తపస్సు సలిపెను. మండుటెండలు, మంచుతెరలు జడివానలు, ఝంఝామారుతములు సలిపిన కఠినపరీక్షలో సిద్ధార్థుఁడు కృతకృత్యుఁడై నిలిచెను. భిక్షాన్న మాహారము. భావసమాధియే నిత్యవ్రతము. పక్షు లాతని భుజములపై విశ్రమించి భిక్షాపాత్రలోని యాహారమును నారగించి పోవుచుండెడివి. అతఁ డుషఃకాలమున లేచి, శీతలోదకముల స్నానమాచరించి యాలారుకడ యోగవిద్యారహస్యముల నభ్యసించి రాజగృహమున భిక్షాటనము సలిపి తిరిగి సమాధిముద్రాముద్రితుఁ డయ్యెడివాఁడు. ఆత్మవికాసమునకు, జ్ఞానోదయమునకు శరీరము ప్రతిబంధక మని యోగసాధకుల యభిప్రాయము. ఇంద్రియముల నిరోధించి, దుఃఖాతీత మైన యానందమోక్షమును సాధింపఁ జూచుటయే వారి తపోయోగము.

ఊర్ధ్వబాహులై కొందఱు తప మాచరించు చుండిరి. మఱి కొందఱొంటి కాల నిలిచి, నిమీలితనేత్రులై వాయు భక్షకులై శుష్కించి తపస్సు చేయు చుండిరి.

ఈ యోగసాధనకు గమ్య మేమి? ప్రయోజన మేమి? భూమిలో మానవ జీవితములో లేని యానందము జన్మాంతమున నెచ్చటో స్వర్గమున లభించునా? అయిన నిహలోకజీవితము దుఃఖపూరితము కాక తప్పదా? ఈ తపస్సువలన సిద్ధార్థునకు మనస్సంక్షోభ ముపశమింప లేదు.

ఒకనాటి మధ్యాహ్నమున సిద్ధార్థుఁడు గుహాంగణ మున నిలిచియుండ మేకలమంద ముందు గోచరించెను. కాప రులు దారి తప్పు మేకల వంకర కఱ్ఱలతో మోదుచు నదలించు చుండిరి. ఆ మందలోఁ గవల పిల్లలఁ గన్న మేక యొకటి గలదు. అందొక మేకపిల్ల కుంటిది. తల్లిమేక ముందరుగు పిల్లకొఱకు ముందునకుఁ గుంటిపిల్ల కొరకు వెనుదిరుగుచు మిక్కిలి చిక్కు పడు చుండెను సిద్ధార్థుఁడా కుంటిపిల్ల నెత్తుకొని నిముర సాగెను. తల్లిమేక యాగినది. కాపరులు వచ్చినిలిచిరి. సిద్ధార్థుఁడు కాపరు లతో "మధ్యాహ్నముననే పురమునకు మందను మళ్లించు చున్నా రేల" యని ప్రశ్నించెను. 'దేవా! మేము బింబిసార చక్రవర్తి మేకల కాపరులము. చక్రవర్తి యజ్ఞము చేయుచు న్నాఁడు. నేటి రాత్రి నూరుమేకల బలి యిత్తురు' అని కాప రులు సమాధానము చెప్పిరి. సిద్ధార్థునకు సర్వము విదిత మైనది. అతఁడా కుంటి మేక పిల్లను భుజమున నిడుకొని వారి ననుసరించెను.

మేకలమందతో సిద్ధార్థుఁడు పురోపాంతమున విడిసెను. కుంటిమేకను భుజములపై మోసుకొని వచ్చుచున్న యాతని జూచి ప్రజలు మూగిరి. కిసాగోతమి యను వృద్ధవనిత విలపించుచు సిద్ధార్థుని గలిసికొనెను. ఆమె యేకైక సుతుఁడు పాముకాటుచే మరణించెను. ఆమె భిక్షాటనమునఁ దన గుడిసెకు వచ్చిన సిద్ధార్థునిఁ గని పుత్రుని బ్రతికింపు మని దీనాలాపముల మిక్కిలి ప్రార్థించియుండెను. అతఁడామెను మరణదుఃఖము నెరుగని గృహస్థుల యొద్దనుండి యావాలు తెమ్మని పంపెను. ఆమె రాజగృహమెల్లఁ గలయఁ దిరిగెను. ఎక్కిన గడప దిగుటయే గాని మరణ దుఃఖము నెరుగని కుటుంబమే యామె కా మహా నగరమునఁ గనుపింపలేదు. ఆమె నిరాశాహృదయముతోఁ దిరిగి వచ్చుచు సిద్ధార్థున కెదు రాయెను. ఆమె యుపాయాంతరమునఁ దన బిడ్డను బ్రదికింప సిద్ధార్థుని వేడుకొన సాగినది. ఆ వృత్తాంతమును విన్నవారందఱు సిద్ధార్థ యోగి యేమి చెప్పునో విను కుతూహలముతో నుండిరి. సిద్ధార్థుఁడు, చల్లని చూపులతో నామె ననునయించి, 'తల్లీ ! ఆవాలు లేని యిల్లు లేదు. మరణ దుఃఖము నెరుగని గృహము లేదు. సర్వసామాన్య మైన మృత్యువు నీ పాలిటి ప్రత్యేకవిపత్తుకాదు గదా ! సర్వజను లిట్లు దుఃఖపీడితులు కా నేల? ఈ రహస్య మెఱుగుట కొఱకే నాతపస్సాధన. నీ సంతాపమునకు మందు ధీరత్వమే !' యని పలికెను. గుమిగూడిన ప్రజలందఱు అద్భుతావహ చిత్తులై సిద్ధార్థ యోగి తత్త్వోపదేశమునకు దోసిలి యొగ్గిరి. కిసాగోతమి ప్రసన్న చిత్తయై ధీరత్వము వహించెను.

సిద్ధార్థుఁడు బింబిసారయజ్ఞవాటికకు మందతోఁగలసి పయన మయ్యెను. అతనికీర్తి యతనికంటె ముందుగనే యజ్ఞ వాటికను బ్రవేశించెను. బింబిసారచక్రవర్తి యీ వార్త విని యాశ్చర్యచకితుఁ డయ్యెను.

యజ్ఞపశువులతోఁగలసి కుంటిమేకను భుజముపై నెత్తు కొని వచ్చుచున్న సిద్ధార్థయోగిని గాంచినంతనే బింబిసార చక్ర వర్తి మండపము వీడి ముందునకేగి ప్రత్యుత్థానము సల్పి స్వాగత మర్పించెను. చక్రవర్తి కిరుప్రక్కల వేదమంత్రములఁ బఠించుచు బ్రాహ్మణులు నిల్చియుండిరి. యజ్ఞకుండమునుండి హావిర్ధూమము వెలువడుచుండెను. ఋత్విజులు సుగంధద్రవ్య సంభృతమైన సోమరసము నగ్ని కుండమున బ్రేల్చుచుండిరి. చుట్టును బచ్చి నెత్తురు కాలువ యిసుక మడిలోనికిఁ బ్రవహించి యింకిపోవుచుండెను. ఒక మేకను బలిపీఠమున దర్భలవెంటితోఁ గట్టియుండిరి. ఋత్విజుఁడు వాడి కత్తి ధరించి మంత్రోచ్చాటన సల్పుచుండెను మంత్రార్థ మిది. "ఓ యజ్ఞభోక్తలైన దేవత లారా! ఈ యజ్ఞపశుకంఠమునుండి చిమ్ముగొట్టము వలె చిందెడి యరుణ కవోష్ణరక్తమును దాగి యానందింపుడు. ఈ నైవేద్యము శ్రీబింబిసారచక్రవర్తియొద్దనుండి, ఘృతాన్న సోమరస పూరితముగా నగ్నిహోత్రుని సహస్రజ్వాలాముఖ మున మీకు వచ్చుచున్నది. ఈ మహారాజు పాపములన్నియు నీ యజ్ఞాగ్నికుండమున భస్మీభూత మగు గాక! ఇదిగో! యజ్ఞపశువు కంఠము ఖండిత మగుచున్నది.

మంత్రోచ్చాటన ముగిసినది. ఋత్విజుఁడు ఖడ్గమును ఝళిపించెను. సిద్ధార్థయోగి నోట 'ప్రభూ! జీవహింస నిషేధింపుఁడు. అమాయిక ప్రాణిని రక్షించి పుణ్యము గట్టుకొనుఁడ' ను శాంత గంభీరనినాదములు వెలువడెను. సదస్యులందఱు నిశ్చేష్టు లైరి. ఋత్విజుని కత్తి యప్రయత్నముగఁ జేతినుండి జారిపోయెను. కరుణారస పరిభాతరళ మైన సిద్ధార్థుని తేజోనేత్రములు సౌమ్యగంభీరవాగ్విన్యాసము యజ్ఞవాటికలో సదస్యుల హృదయాంతరాళములోఁ బ్రతిధ్వనింప సాగినవి. చక్రవర్తి యాతని కోమలనయనదీధితులఁ గాంచుచు గగురుపాటుతో నిలిచియుండెను.

సిద్ధార్థుఁడు మందగంభీరయానమున బలిపీఠమున నున్న యజ్ఞపశువు మెడలోని దర్భల వెంటని దీసివేసెను. అతని నెవరు నేమి యన లేక పోయిరి. మేకపిల్ల సిద్ధార్థుని కాళ్ల నంటి నిలిచినది. అతఁడు మెల్లగఁ గంఠమునెత్తి యుపన్యసింపసాగెను.

"ప్రభూ! ప్రాణ మన్న సకల జీవులకు మిక్కిలి ప్రీతి. మానవుఁడు ప్రాణ మపహరింపఁ గలవాఁడు గాని ప్రాణప్రదానము సలుపలేడు. ఒక ప్రాణి పాపపంకమును వేఱొక ప్రాణి రక్తము కడుగఁ జాలదు. ఇట్టి స్వార్థదుర్బుద్ధికంటె వేరు పెద్ద పాప మేమి కలదు?

నిండుప్రాణుల కంఠరక్తమును ద్రాగఁగోరు వా రెవ్వరైన దేవతలో? రాక్షసులో? యోచింపుఁడు. ఆత్మసుఖాపేక్ష

కలుగు నను దుర్భ్రమతో దీనపశుహత్య చేయుటకంటె గొప్ప పాప ముండునా? దుష్ట దేవతలకు భయపడి కంఠరక్తమును లంచ మిచ్చుట వీరపురుషలక్షణమా? మానవరక్తమును త్రాగిగోరు వారినిఁ గూర్చి మన మేమను కొందుము? అయిన మనము చంపుచున్న జీవులు మానవులను గూర్చి యే మను కోవలెను? మానవుడు కోటి జీవముల హింసించుచుఁ దన్నె వరును హింసింప రాదని యెట్లు ప్రార్థింపఁ గలఁడు? విశాల సృష్టిలో భూతదయ కలిగిన కరుణార్ద్రహృదయము కంటె విలువ గలిగిన వస్తువేది? దయ మానవ జీవితము నెంత మనో జ్ఞముగ దిద్దునో యోచింపుడు. కృపాపరత సృష్టి నానంద ధామ మొనరించును.”

సిద్ధార్థయోగి వచనములు విన్న సదస్యుల హృదయ ములలో సద్యఃపరిణామము వెల్లివిరిసినది. ఋత్విజు లవనతవద నులై నెత్తుటి చేతుల నుత్తరీయముల మాటున దాచుకొనిరి. బింబిసారచక్రవర్తి సిద్ధార్థుని పాదముల వ్రాలి, తన సింహాసన మును స్వీకరింప నతనిఁ బ్రార్థించెను. సిద్ధార్థుఁ డిదివరకే సింహా సనకిరీటములఁ ద్యజించి వచ్చిన విషయము విని సదస్యులు సంభ్రమాశ్చర్య వివశులైరి. చక్రవర్తి భూతబలిని, యజ్ఞకర్మ లను మగధ రాజ్యమున నిషేధించుచు శాసనమును బ్రయో గించి సిద్ధార్థుని రాజగురువుగా నుండ వేడుకొనెను. కాని సిద్ధార్థుఁడు సత్యాన్వేషణార్థము గయాప్రాంతాటవులకుఁ బోవ సంకల్పించుకొని నట్లును, జ్ఞానోదయ మైన పిమ్మట బింబిసార

చక్రవర్తి కుపదేశము సల్పి సౌహార్ద ఋణము దీర్చుకొనవ
లని చెప్పి, యతని వీడ్కొని వెడలిపోయెను.

రాజగృహమునుండి సిద్ధార్థుఁ డుపవేలారణ్యమున కరిగి బర్బర పర్వత ప్రాంతమున ఫాల్గునీనదీతీరమున యోగసాధన కుపక్రమించెను. సృష్టిరహస్యములనుగూర్చి, యుత్పత్తిస్థితిలయములనుగూర్చి, కాలప్రభావమునుగూర్చి నిరంతర యోచనలలో నిమగ్నుఁడై యతఁడు నిద్రాహారముల మఱచు చుండెడివాఁడు. సూర్యచంద్రోదయాస్తమయముల నెఱుంగక ధ్యానమగ్నుఁడై యున్న యతని దీక్ష యా యడవిలో నున్న వైదుగురు యతుల నాశ్చర్యపరవశులను జేసెను. వారు సిద్ధార్థుని తపఃపరిణామము నరయఁగోరి యతని దినచర్యను బరిశీలింప సాగిరి. గౌతమ గోత్రజుఁ డైన ఋషి యెవ్వరో భిక్షాటనమును గూడ మఱచి, కందమూలముల భుజించుచు నిరంతరధ్యానసమాధిలో మునిగి కఠోరతపము సల్పుచున్నాఁడని మాత్రమే తెలిసికొనగలిగిరి. గౌతమముని శరీరము పోషణలేక నానాటికిఁ గృశింప సాగినది. ధ్యానసమాధిలో నుండగా నొకనా డతఁడు మూర్ఛవోయెను. అడవిలో మేకలు మేపుచున్న గొల్లవాఁ డొకఁడు మూర్ఛితుఁ డైన గౌతమఋషినిఁ గాంచెను. మహాముని యెవ్వరో యగ్రకులసంభవుఁడు. అతఁడా గొల్లపిల్లవాఁడు. తన ముంతలోని పాలు ముని నోటిలోఁ బోసినఁ బాపము కాదా? ఆలోచించి గొల్లవాఁడు మేకను దెచ్చి, పాలు ముని నోటిలో పడునట్లు పిండసాగెను. బిడుచఁ గట్టిన నోటఁ బాలతడిచే నాలుక యాడసాగెను. గౌతమయోగి కొంత తడవునకుఁ దెప్పరిల్లి గొల్ల

పిల్లవాని ముంతలోని క్షీరము నర్థించెను. కాని, యా పిల్లవాఁడు తా నంటుటచే మైల పడిపోయిన పాలను మునీశ్వరున కిచ్చుటకు జంకెను. గౌతమయోగి మనస్సు నొచ్చెను. "తండ్రీ ! పుట్టుకచే మనుజు లందఱు సములే. దుష్కార్యము సలుపువారు దుర్జనులు. సత్కార్యము లొనరించు వారు సజ్జనులు. గుణకర్మలచేత బ్రాహ్మణుఁడు గూడ దుర్జనుఁడు కావచ్చును. అట్లే సత్ప్రవర్తనవలన నెవ రైన సజ్జనులు కాఁగలరు. దయారస హృదయుఁడ వైన నీవు సుకృతివి. నాకు నీ ముంతలోని పాలిచ్చి యాదరింపు" మని యతఁడు పిల్లవానిని వేఁడుకొనెను. మిక్కిలి సంతోషముతో నా గొల్లపిల్లవాఁడు శాక్యమునికి ముంతలోని పాల నిచ్చి ధన్యుఁ డయ్యెను.

మఱునాఁడు, సమీపపట్టణము నందలి యిండ్రదేవాలయోత్సవమున నొక వేశ్య పాడుకొనుచు నరుగుచుండెను. ఆమె పాడిన గీతము గౌతమముని నాకర్షించెను. "వీణాతంత్రులు తగుపాటి బిగువులో శ్రుతి సేయుము. బిగువు హెచ్చిన తీగ తెగును. తగ్గిన నాదము పలుకదు. కావున నధికతా న్యూనతల వర్జించి యుచితస్థాయి నెలకొల్పి మధురనాద మనుభవింపుము." ఇది గీతార్థము. శాక్యముని కది జీవితవేదాంతముగఁ దోచెను. తపస్సాధన మితిమీరిన శరీరమే శిథిలము కావచ్చును.

గౌతమఋష్యాశ్రమసమీపమున నొక గ్రామముకలదు. అందు సుజాత యను సాధ్వి పుత్రలాభము కొఱకు వనదేవతకు మ్రొక్కుకొని యుండెను. ఆమె పుత్రవతి యైనది. మ్రొక్కు దీర్చుకొనుటకుఁ బరిచారికతోఁ గూడి పూజాద్రవ్య

ములఁ గొని వనమున కేతెంచెను. వనదేవతాలయము ముందు చెట్టు క్రింద గౌతమ యోగి కూర్చొని యుండెను. పరిచారిక యతనిఁ గాంచి వనదేవుఁడే సాక్షాత్కరించె నని కేక వేసెను. సంభ్రమ మాశ్చర్యములు పెనఁగొన సుజాత తనకుఁ బుత్రసంతాన మనుగ్రహించి, పద్మాసనాసీనుఁడై వృక్షమూలమున వనదేవుఁడే వేంచేసి యుండెనని తలచి భక్తితో నిమీలితనేత్రయై తాను దెచ్చిన పాయసాన్న మతనికి సమర్పించెను. శాక్యఋషి యా పాయసాన్నమును మిక్కిలి యాప్యాయముగ భుజించెను. ఆతని శరీరమున కొక క్రొత్త దార్ఢ్య మలముకొనెను. అతఁడా పాయసాన్నమున కా రుచి యెట్లు వచ్చిన దని సుజాతను బ్రశ్నించెను. ఆమె చేతులు మోడ్చి, "వనదేవ ప్రభూ! మా మందలోఁ గల నూరు పాడి యావులఁ బిదికి యాబది యావులకుఁ బోసి, వాని పాలు తిరిగి యట్లే యిరువది యైదు మొదవులకుఁ బోసి, తిరిగి వానిపాలు పండ్రెండావులకు, వాని పాలా ఱావులకుఁ బోసి యా యాల పాలతో నీ క్షీరాన్నమును సిద్ధ మొనర్చితిని. నా తొలి మ్రొక్కు చందమిదియే" యని వచించెను. తిరిగి యామె శాక్యమునినిఁ గాంచి, "ప్రభూ! నీవే దివ్యపురుషుఁడవో, లేక సాక్షాత్కరించిన వనదేవప్రభువవో! మనుష్య రూపము ధరించి నన్నుఁ గరుణింప వచ్చితివి" ని భక్తిపూర్వకముగఁ బ్రశ్నించెను.

శాక్యముని, మందహాసరుచిరాననుఁడై మధుర గంభీర స్వరమున "తల్లీ! నీ సుతుఁడు చిరాయువై వర్ధిల్లుగాక! నేనే దివ్య పురుషుఁడను గాను. తొల్లి, యొక రాజకుమారుఁడను. ఇప్పుడు

సత్యాన్వేషినై యోగి నైనాను. దివ్యజ్ఞానోదయము కొఱకు వేచి యుండగా శరీరదౌర్బల్యమున స్పృహ తప్పినది. నీవు పెట్టిన క్షీరాన్నము ప్రాణముల నిలిపినది. పాలిచ్చిన తల్లి మేలు, పాయసాన్నము పెట్టి ప్రాణదాన మొనరించిన నీ మేలు తుల్యములే!" యని వచించెను. సుజాత కనుగొలుకుల వెలుగు వెల్లువలోఁ బవిత్రసంతృప్తి వెల్లివిరిసెను.

శాక్యముని మరల సుజాత పుత్రుని దీవించెను. అతఁడామె జీవితములో గోచరించిన సరళత తృప్తి కానందించి, ధ్యాననిమగ్నుఁ డగుచుండ సుజాత నమస్కారపూర్వకముగ నతని వీడ్కొని యింటికిఁ బోయెను. గౌతమయోగి తపస్సాధనను బరిశీలించుచున్న యతిపంచక మాతఁడు సుజాత యాతిథ్యము కడుపార నారగించి భ్రష్టతపస్వి యయ్యె నని విచారించి, రహః ప్రదేశమును వర్జించి, యోగసాధనకుఁ దత్త్వజ్ఞానమునకుఁ బ్రసిద్ధి వహించిన కాశీనగరమునకై పయనించిరి. ఆనాటి రాత్రియే శాక్యముని వనదేవతాలయవృక్షమూలమును విడిచి బోధి వృక్షచ్ఛాయలోఁ బద్మాసనాసీనుఁడై ధ్యాననిమగ్నుఁ డయ్యెను. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు, నింద్రియ లాలసత్వము నజ్ఞానాంధకారములు శాక్యమునిని వీడి భస్మ మగుచున్నట్లతని మనోనేత్రమునకు దివ్య దర్శనము కలిగెను. రాత్రి తృతీయ యామ మగుసరికి జ్ఞానోదయమై శాక్యముని బుద్ధుఁ డయ్యెను.

స్థిరసౌదామినివలె మోక్షజ్ఞానము బుద్ధుని మనస్సులో దివ్య తేజఃపుంజములు వెలార్చ సాగెను. ఆ వటవృక్షమూలము

దివ్యస్థలమై ముముక్షువులకుఁ బరమపవిత్రయాత్రాస్థలమై వెలిసినది. బోధివృక్షము ప్రపంచమునఁ బరమపూజ్యతా నార్జించుకొన్నది. ఖండ ఖండాంతరములు యుగ యుగాంతరము లా పవిత్రస్థలమును దర్శించి పులకింపఁ గలవు. నిర్వాణానంద మనుభవించుచు బుద్ధుఁ డేడు వారము దివసము లా బోధివృక్ష మూలముననే యుండెను. విశ్వకల్యాణమూర్తి, జగద్విమోచనమునకై జ్ఞానోపదేశమును సలుపుట కుపక్రమించి బోధి వృక్ష మూలమునుండి లేచి కాశీనగరమునకుఁ దరలి పోయెను.

కాశీనగరప్రాంతమునఁ గల ఋషి పట్టణ మను మృగదావమును బుద్ధుఁడు సమీపించెను. ఉరువేలారణ్యము నందతని విడిచి వచ్చిన యతి పంచకము దవుదవ్వుల బుద్ధునిఁ గాంచిరి. కాని భ్రష్టతపస్వి గౌతమశ్రమణునకుఁ బ్రత్యుత్థాన మర్యాదలతో స్వాగతము సలుప నక్కర లేదు. ఎదు రేగి కమండలువు చీవరము నందుకొన వద్దు. ఇచ్చ వచ్చిన నతఁడే యాసనమునఁ గూర్చుండు నని నిశ్చయించుకొనిరి. బుద్ధుఁడు దగ్గరకు వచ్చెను. దివ్యజ్ఞానరోచిస్సులను జిమ్ముచున్న బుద్ధుని తేజోనేత్రములఁ గాంచి వారి నిశ్చయమును మరచిరి. ఒకఁడు బుద్ధుని కమండలువు నందుకొనెను. మఱియొకఁడు చీవరమును బుచ్చుకొనెను. అంద అభివాదములు సల్పి వినయసంభ్రమములతో నతని కాసన మొసగిరి. కాని,-యింకను నతని, శరీర సుఖలోలాత్ముఁడై సుజాత యొసగిన మృష్టాన్నమును స్వీకరించిన భ్రష్టతపస్వి గౌతమమునిగనే భావింపసాగి, 'మిత్రమా-గౌతమా' యని సంభాషణమున సంబోధింప సాగిరి. జ్ఞానుల కుపయుక్త

మను పూజ్య 'భంతే' శబ్దముతోఁ బిలువ లేదు. బుద్ధుఁడు వారికి జ్ఞానోపదేశము సలిపి యుద్ధరింప దలచి, "భిక్షువులారా! తథాగతుఁడు సంయక్సంబుద్ధుఁడు—నేను సంపాదించిన దివ్యజ్ఞానము నుపదేశించెదను. ఆలకించి, యనుసరించి మీరును నిర్వాణానంద మనుభవింపుఁడ"ని ప్రవచించెను.

యతిపంచకమున కింకను సుజాత యాతిథ్యస్వీకార ఘట్టమే కలవరపెట్టు సాగినది. వారి చిత్తములు సంశయడోలాందోళితము లయ్యెను. బుద్ధుఁడది గ్రహించి, "భిక్షువులారా మున్నెన్నఁడైన మీతో నాకు జ్ఞానోదయ మైన దని చెప్పి యున్నానా?" యని ప్రశ్నించెను. ఆ ప్రశ్న వారి హృదయాంతరాళముల నెల్ల శోధించివైచెను. అప్రయత్నముగ 'భంతే!—చెప్పియుండలేద'ని మారు పలికిరి. వారి మనస్సులలో బుద్ధుని యెడ శ్రద్ధాభక్తు లంకురించినవి.

అంతట బుద్ధుఁడు వారలకు జ్ఞానోపదేశ మొనరించెను.

"భిక్షువులారా!

జన్మ దుఃఖము
జన్మకుఁ గారణము జీవనతృష్ణ.

జన్మరాహిత్యమునకు మార్గము తృష్ణాసంహృతి. అష్టాంగిక పథమునఁ బ్రవర్తించుట వలనఁ దృష్ణ నశించును.

"ఈ సత్య చతుష్కమును గ్రహించిన వాఁడే జ్ఞాని" పంచ భిక్షుకులలో నొకఁడగు కౌండిన్యుఁడు "భంతే! అష్టాంగ పథమును వివరింపఁ బ్రార్థన" యని విన్నవించెను.

సంయగ్దృష్టి
సంయక్సంకల్పము
సంయగ్వచనము
సంయక్కర్మ
సంయగ్జీవిక
సంయక్కృషి
సంయక్స్మృతి
సంయక్సమాధి." యష్టాంగ పథ మని బుద్ధుఁడు వివరించెను.

"ప్రాణి తన్ను తానే రక్షించుకొనవలెను. చేసినకీడు చెందక తప్పదు. దుఃఖము దుష్కృత్యముల వలన సంభవించును. సుకృత్యముల నాచరించి నిర్వాణపథమును బొందవలెను. యజ్ఞయాగాదులు పాపములను బరిహరింపఁ జాలవు. భూతదయయే యుత్కృష్టధర్మము"

చల్లనిచూపు, దయామృతతరంగిణులు వెల్లువలు వారిన హృదయము, తేజఃప్రసన్నవదనముతో బుద్ధుఁడు మృగదావమున సల్పిన ధర్మ ప్రబోధమును మొట్టమొదట నాకర్ణించు భాగ్యము యతిపంచకమునకుఁ గలిగెను. ఉపదేశము నాకర్ణించిన వెంటనే కౌండిన్యుఁడు బుద్ధుని పాదముల వ్రాలి ప్రవ్రజ్యాదీక్ష నర్థించెను.

బుద్ధుఁడు కొండన్న జ్ఞాని యయ్యె నని సంతోషించుచు వానికిఁ బ్రవ్రజ్యాశ్రమమును నుపసంపదయు నొసంగెను. తరువాత మిగిలిన నలుగురు యతులును బుద్ధుని శాస్తృగా పరిగ్రహించి, ప్రవ్రజ్యోపసంపదల నందిరి.

మృగదావమున శిష్యులు తెచ్చి యిచ్చు భిక్షాన్న మారగించుచు బుద్ధుఁడు తన ధర్మచక్ర ప్రబోధమును వెల యించుచు నచ్చట కొంత కాలము నివసించెను.

కాశీపట్టణప్రాంత మందలి మృగదావమున శిష్యులకు ధర్మ ప్రబోధము సలుపుచున్న బుద్ధ భగవానుని కీర్తి కాశీ పట్టణమునకు వ్యాపించెను. ఆ చోటు ఋషివాటిక, సార్నాథ్ గాఁ బ్రసిద్ధి కెక్కెను. ప్రజలు నిత్యము బుద్ధభగవానుని సందర్శించి పోవుచుండిరి.

కాశీపట్టణమున సుప్రసిద్ధ వణిజుని పుత్రుఁడు యశుఁడు. మహాసంపన్నున కుద్భవించిన యశుఁడు భోగవిలాసలాలసుఁడు. అతఁడు ఋతువుల మార్పున కనుగుణముగ నిర్మించుకొన్న గ్రీష్మ, వర్ష, హిమ హార్మ్యముల సంతత సంగీత గాన వినోదములఁ బ్రొద్దు పుచ్చుచుండెను. ఒకనాఁటిరాత్రి వేశ్యల నృత్త గీత మధ్యమున యశుఁడు నిద్రించెను. వేశ్యలును గనులు మోడ్చి విశ్రమించిరి. యశుఁడు కనువిచ్చి చూచు సరికి నిద్రాళువు లైన యా వేశ్యల యవయవములలోఁ దొల్లిటి జగన్మోహన సౌందర్య దీధితులు తోలుకాడుట లేదు. నృత్యసమయమున వేశ్యల

యాహార్యచాతుర్యము కల్పించిన దృశ్యము, కనికట్టుల కాయ శ్రేఁషు నిస్సారపోయెను. ఎండమావులను వలచిన తన యవివేకమును నిందించుకొనుచు యశుఁడు తన భోగమందిరమును వీడి నగరము కలయఁ దిరిగి చివరకు బుద్ధవిహారమున కేఁగఁ దలపోసి మృగదావమును జేరెను.

మఁసి మసి చీకఁటులు చెదరిపోవుచున్న యా వేఁకువ వెలుఁగులో నొంటరిగా నడయాడుచున్న యశునకు దవ్వుదవ్వుల విహారప్రాంగణమున బుద్ధ భగవానుఁడు గోచరించెను. అతఁడు బుద్ధభగవానుని పాదములపైఁ బడి రిత్తబ్రతుకు నుండి రక్షింప వేఁడుకొనెను.

బుద్ధుఁడు, "సంతాపము, దుఃఖభారము, శూన్యభావము తొలిగించు వెలుఁగు కలదు. నీకు జ్ఞానోదయము కాఁగలదు. ఇటు కూర్చుండు మ"ని యశుని జీరెను. యశుఁడు తన కాంచనపాదరక్షల వీడి బుద్ధభగవానునకు నమస్కరించి, యతని పాదసమీపమునఁ గూర్చుండెను. బుద్ధుఁ డతని చిత్తశుద్ధి గ్రహించి, ధర్మబోధకము లగు ననేకకథలను జెప్పెను. యశుని పరితాపముదయభానుని కోమలకిరణద్యుతులచే మాయమై పోయెడి దిమ్మ చీకఁటి వలె నంతరించెను.

ప్రాతఃకాలమున యశుఁ డింటి యొద్దఁ గన్పింప లేదు. తల్లి యశుని తండ్రియగు శ్రేష్ఠితోఁ జెప్పినది. యశుఁడు స్వేచ్ఛావిహారి. అతనికి శత్రువులు లేరు. ఇష్టోపభోగవిలాసముల నను

భవించు నతఁ డిల్లు వీడ నేల? శ్రేష్ఠి నగరమంతయుఁ దిరిగి చివరకు బుద్ధ విహారమును జేరెను. అచ్చట శ్రేష్ఠి తేజఃపరివేషముతోఁ గన్నులకు మిరుమిట్లు గొలుపుచు వెలుఁగుచున్న కృపామూర్తి బుద్ధునిఁగని, యతనికి సాష్టాంగప్రణామము లొనర్చి, ఒడలెల్ల పులకించి బాహ్యస్మృతిని వీడెను. శ్రేష్ఠి తెప్పరిల్లి, యావిహారము నందలి బుద్ధభగవానుని, సత్యస్వరూపు లైన యతిపంచకమును గాంచి, పరిశుద్ధమనస్కుఁ డయ్యెను. అతఁడు బుద్ధభగవానుని డాసి, తరణోపాయ మనుగ్రహింప వేఁడుకొనెను. బుద్ధుఁడు కరుణించి, యతనికి శరణత్రయ దీక్ష నిచ్చెను.

బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి

ఇది, శరణత్రియము. బుద్ధుని శిష్యసంఘములోఁ జేరు వారికి మూఁడు దీక్షలను గైకొనవలెను. ఈ శరణత్రియమును గైకొనిన తొలియుపాసకుఁడు శ్రేష్ఠియే. బుద్ధోపాసకుఁడైన పిమ్మట శ్రేష్ఠి కుమారునిఁ గాంచి, "తండ్రీ! మీ యమ్మ నీ కొఱకుఁ గాచుకొని వెంగటిలి యున్నది"ని నుడువుట తోడనే, బుద్ధుఁడు "శ్రేష్ఠీ! నీవు నిరర్థకములు తుచ్ఛము లని నిరసించిన సంసార వ్యామోహముల వైపునకే నీ పుత్రు నేల పురికొల్పుచున్నావ"ని సూటిగాఁ బ్రశ్నించెను. శ్రేష్ఠి పశ్చాత్తాము చెందెను. బుద్ధభగవానుని యుపదేశముల నాకర్ణించుచున్న యశుఁడు మనఃకల్మషములు దొలఁగ, శుద్ధుఁడై, సన్న్యాసము నుపసంపద నందెను.

శ్రేష్ఠి బుద్ధుని శిష్యసమేతముగాఁ దన గృహమునకు విందున కాహ్వానించి వీడ్కొని వెడలి పోయెను. బుద్ధుఁడు తన శిష్యులకు శిరోముండనము, కాషాయవస్త్ర ధారణము, విహార నివాసమును విధించెను. సమస్తైశ్వర్య భోగములతోఁ దులఁ దూఁగుచున్న కాశీశ్రేష్ఠిపుత్రుఁడు యశుఁడు గడ్డము మీసలు దీసి శిరోముండనము గావించుకొని కాషాయాంబరధారియై బౌద్ధసన్న్యాసి యయ్యె నను వార్త ప్రజల కాశ్చర్య మొదవించెను. బౌద్ధమత మన్నఁ బ్రజలకుఁ బూజ్యభావ మేర్పడెను.

యశుని మిత్రులు పరిఖ్యాతశ్రీమంతులు విమలుఁడు సుబాహుఁడు, పూర్ణజిత్తు గవాంపతి బుద్ధుని శరణు వేడి సన్న్యాసమును స్వీకరించిరి. తరువాత నేబదిమంది పెద్దలు బుద్ధుని ప్రభావమును విని ధర్మదీక్ష నర్థించి, ప్రవ్రజ్యము, బోధ, నుపసంపద నొందిరి. అప్పటికి బౌద్ధమత సంఘమున నరువదిమంది యర్హంతు లేర్పడిరి.

బౌద్ధభిక్షువులు నానాదిశలకుఁ బోయి జిజ్ఞాసువులఁ దోడ్కొని రాసాగిరి. భిక్షువుల సంఖ్య క్రమ క్రమముగ నధికమయ్యెను. ఒకనాటి సాయంకాలమున బౌద్ధభిక్షువుల నందఱఁ జేర్చి బుద్ధుఁ డుపన్యసించెను.

'ప్రజాహితార్థము మీరు ధర్మప్రచారము సలుపుఁడు. శరణత్రయ దీక్ష నొసఁగి భిక్షువుల సంఘమునఁ జేర్పుడు. భిక్షువులు బ్రహ్మచారులై సంఘవిహారములఁ గఠోరనియమ బద్ధులై దశశిక్షాపథముల ననుసరించి దినచర్య దిద్దుకోవలెను.

౧. జీవహింస సలుపరాదు.
౨. పరద్రవ్యాపహరణము చేయరాదు.
౩. పాపకార్యములు చేయఁగూడదు.
౪. అసత్య మాడరాదు.
౫. మద్యపానము కూడదు.
౬. అకాల భోజనమును విసర్జింప వలెను.
౭. నృత్యగాన వినోదములకు దూరముగా నుండవలెను.
౮. గంధమాల్య సుకుమార వస్త్ర భూషణములు వాడ రాదు.
౯. ఉన్నతాసన వాహనము లుపయోగింప రాదు.
౧౦. రజత కాంచనములు వాడఁగూడదు.

ఇవి బుద్ధుఁడు శాసించిన దశ శిక్షావిధులు.

భిక్షుకశిష్యులను ధర్మప్రచారముకొఱకు వివిధ రాజ్యములకుఁ బంపి, ఋషిపట్టణమునుండి బుద్ధుఁ డురువేలారణ్యమున కేగెను.

ఉరువేలారణ్యమున నురువేలకాశ్యపుఁడు, నదీకాశ్యపుఁడు గయాకాశ్యపుఁడు నను ముగ్గురు జడదారు లుండిరి. ఉరువేల కాశ్యపుఁ డైదు వందల జడదారులకుఁ బీఠాధిపతి. తక్కిన వారలు మూఁడువందలు రెండువందల జడదారుల కధిపతులు. వీర లురువేలారణ్యమున నాశ్రమములు గల్పించుకొని వేదోక్తముగ యజ్ఞకర్మ లొనరించుచున్న సుప్రసిద్ధ సనాతనపండితులు.

బుద్ధుఁ డురువేల కాశ్యపుని యాశ్రమమును జేరెను. ఉరువేల కాశ్యపుఁడు జ్ఞాన తేజస్వి యైన బుద్ధుని కాతిథ్యమర్యాదలు సల్పి యతని నచ్చట నివసింప వేడెను. బుద్ధుఁడతని యగ్నిహోత్రశాలయందు నివసింప సాగెను. అచ్చట నొక మహాసర్పముండెను. అందుచే నచ్చట బుద్ధుఁడు వసించుట మిక్కిలి ప్రమాదకర మని కాశ్యపఋషి హెచ్చరించెను. కాని బుద్ధుఁడు సరకుగొన లేదు. మఱునాటి యుదయమున నా మహాసర్పము బుద్ధుని భిక్షాపాత్రికలో నొదిగి యుండెను. ఉరువేల కాశ్యపుఁ డచ్చెరు వంది, మహాశక్తి సంపన్నుఁ డైన బుద్ధున కభివాదము గావించెను.

ఇట్లే బుద్ధుని మహిమ గుర్తించి, యురువేల కాశ్యపుఁడు తన శిష్యసంఘముతో బౌద్ధ సంఘమునఁ జేరెను. ప్రఖ్యాతపండితుఁ డురువేలకాశ్యపుఁడు బౌద్ధసంఘమునఁ జేరిన వార్త విని, నదీ గయా కాశ్యపులు తమ తమ శిష్యులతో వచ్చి బుద్ధుని శరణు వేడి ధర్మభిక్షుకు లైరి.

బుద్ధుఁ డురువేలారణ్యమును వీడి, రాజగృహమును జేరెను. అచ్చట యష్టికా వనమున శిష్యసంఘముతో బుద్ధుఁ డున్న వార్త విని బింబిసారచక్రవర్తి ద్వాదశపండితపరివృతుఁడై తరలివచ్చి బుద్ధభగవానున కభివాదముసలిపి యాసీనుఁ డయ్యెను.

అచ్చట వారు రురువేల కాశ్యపపండితుని గాంచిరి. అతఁడు బుద్ధశిష్యుఁడా? బుద్ధుఁడే యతని శిష్యుఁడా ? చక్రవర్తి పండితులకు సందేహము కలిగెను. బుద్ధభగవానుఁడు చిరునవ్వు లొలుకుచు, నురువేల కాశ్యపునితో "కాశ్యప ఋషీ ! యజ్ఞాది కర్మల

వీడి శరణత్రయ దీక్ష నేల గైకొంటినో యీపండితు లెఱుఁగ గోరుచున్నా"రని వచించెను. అతఁడు లేచి బుద్ధునకు సాష్టాంగ దండ ప్రణామ మొనర్చి, "నిర్వాణానంద మనుభవించుటకొఱకై పరమపూజనీయుఁడైన బుద్ధభగవానుని శాస్త్రగా స్వీకరించి ధన్యుఁడనైనాను. తథాగతుఁడు బుద్ధభగవానుఁడు. నేను దచ్ఛిష్య పరమాణువు"నని వచించెను. బుద్ధుఁడు, పండితులకు బింబిసార చక్రవర్తికి ధార్మిక కథలను, సత్యచతుష్కము నష్టాంగమార్గము నుపదేశించెను. పండితులు బౌద్ధోపాసకులైరి. బింబిసారచక్రవర్తి, బుద్ధభగవానుఁడు మాటయిచ్చిన ప్రకారము, జ్ఞానోదయ మొందిన పిమ్మటఁ దిరిగి రాజగృహమున కరుదెంచినందుకుఁ గృతజ్ఞతఁ దెలిపి బౌద్ధ సంసారి యయ్యెను. అతఁడు బౌద్ధభిక్షువుల కొఱకు వేణువనవిహారమును నిర్మించెను.

రాజగృహమున రెండు వందల యేబది సన్యాసుల కధిపతి సంజయుఁడను మహాంతు కలడు. సారిపుత్రుఁడు మౌద్గల్యుఁడు నతని ముఖ్యశిష్యులు. ఒకసారి సారిపుత్రుఁ డశ్వజిత్తను బౌద్ధభిక్షుకుఁడు ప్రసన్న సౌమ్యశాంతమూర్తియై పోవుచుండుట గాంచి యాతని వలన బౌద్ధధర్మమును విని బుద్ధదేవుని దర్శించుటకు సహవర్తుఁడైన మౌద్గల్యునితోఁ గలసి వెడలఁ దలచెను. గురువు సంజయుఁడు నిరోధించెను. కాని వారల నిశ్చయము సడల లేదు. "మహాంతుపదవి నా యనంతరము మీదే! ఏల వదలి పోఁ జూచెద"రని సంజయుఁడు వారల దీక్షను సడలింపఁ బ్రలోభమును గల్పించెను. కాని వారు నిరర్థకమైన లౌకిక సంఘ

ముచే నడలి, నిర్వాణానందము నందుటకుఁ బోఁ జూచుచుండ "మహాంతు పదవి" యడ్డఁగలదా! వారు సంజయుని వీడి జ్యోతిర్మూర్తి యైన బుద్ధుని కడ కరిగి బౌద్ధసంఘములోఁ జేరిరి. సంజయుఁడు తన్నువీడిన శిష్యులపై నిందాశాపముల వర్షించెను. అతని శాపగర్జనలు శూన్యాకాశమున లీన మైనవి.

బుద్ధుఁడు రాజగృహమున నుండగ శుద్ధోదనుఁ డతని కీర్తి విని సహస్రరాజబంధువుల నమాత్య వర్గముతో నతని దోడ్తేనిఁ దెచ్చుటకుఁ బంపెను. అమాత్యులు, రాజపురుషులు రాజగృహమున కరిగి బుద్ధుని దర్శించి, భిక్షుసంఘమునఁ జేరిపోయిరి. శుద్ధోదన మహారాజు పుత్రవియోగముచే నందిన పరితాపము బుద్ధున కమాత్యులు వివరించిరి. బుద్ధుఁ డచటినుండి కపిలవస్తుపురమున కేగెను.

కపిలవస్తు నగరమున బుద్ధుని పునరాగమనము మహోత్సవముగ వెల్లివిరిసెను. బుద్ధునకుఁ దన బాల్యము, జనకుని వాత్సల్యము చిననాటి విద్యావ్యాసంగములు; యశోధరాదేవి; యంతఃపుర క్రీడలు; రాహులుని బోసినవ్వులు స్మృతిపథమునఁ దగిలినవి. రాజవీథుల శిష్యసంఘముతో బుద్ధుఁడు భిక్షాటనము సలుపుచుఁ దరలి రాసాగెను. శాక్యయువరాజు కాషాయాంబరధారియై, పాదచారియై, భిక్షాపాత్రికను బూని బిచ్చ మెత్తుకొనుచుఁ వచ్చుచుండెను. శుద్ధోదన మహారాజున కా దృశ్యము దుస్సహ మయ్యెను. ప్రజలు తండోప తండములుగ మూగిరి. పుర మంతయు నలంకరింపఁబడియుండెను. పురవీథుల బుద్ధుఁడు

నడచిపోవుచుండ సౌధహర్మ్యములపైనుండి పూలవర్షము విరిసి నది. ప్రజలు సాష్టాంగ ప్రణామము లొనర్చుచు భిక్షుసంఘములోఁ జేరిపోసాగిరి. బుద్ధుఁడు కపిలవస్తురాజప్రాసాదమును జేరెను. శుద్ధోదనప్రభువు బుద్ధునిఁ గాంచి యుప్పొంగి సైమరచెను. పుత్రుఁడు మహాజ్ఞాన తేజస్వియై, జగద్గురువై తన మ్రోల నిలిచెను. శుద్ధోదన మహారాజుజన్మ ధన్యమైనది. బుద్ధుఁడు తన మృదుహస్తస్పర్శచే శుద్ధోదన ప్రభువును సమ్మానించెను. శుద్ధోదనుఁడు బుద్ధుని మహాభినిష్క్రమణానంతరము యశోధర గడిపిన నిర్మల సాధు జీవితమును నామె మనోనుతాపమును వివరించెను. బుద్ధుఁడు మహారాజుతోఁ గలిసి, యిద్దరు భిక్షుకుల వెంట నిడుకొని యశోధరా దేవి మందిరమున కేగెను.

యశోధరా దేవి, బుద్ధుని కెదురువచ్చి సాష్టాంగ ప్రణామమున నాతని పావనపాదములు కన్నీటితోఁ గడగి యర్ఘ్యాంజలి నర్పించెను. తృణశయ్య, కురుచగాఁ గత్తిరించిన శిరోజములు, కావి నారచీరలు, యశోధరా దేవి వియోగినీజీవితమును స్వయం వ్యక్త మొనర్చినవి. ఆమె యధోముఖియై బుద్ధభగవానుని పవిత్ర పాదములఁ జూడ్కులు నిలిపి, యాత్మనివేదన మొనరించుకొన సాగినది. ఇంతలో రాహులుఁడు చెంగు చెంగున వచ్చి యశోధర చేలాంచలములఁ బట్టి నిలిచెను. ఆమె, రాహులుని చేతులు మోడ్చి, 'తండ్రీ! జగద్గురువౌ మీ తండ్రిగారికి నమస్కరింపు మని' యుద్బోధించెను. రాహులుఁడు బుద్ధుని పాదముల నొరగి, లేచి యతని కాషాయాంబరమునుబట్టి యొదిగి నిల్చెను. బుద్ధుఁడు సారీపుత్రుని బిలిచి, "ప్రాపంచిక సంపదలు

నశ్వరములు. శాశ్వత నిర్వాణానందమునకీ బిడ్డఁడు వారసుఁడగు గాక. ఇతనికి దీక్ష నిమ్మ"ని యాదేశించెను

బుద్ధుఁడంతఃపురమును వీడి కపిలవస్తుపురోపాంతమున రోహిణీనదీతీరమునఁ గొంతకాలము వసించెను. ఆనందుఁడు, నందుఁడు, మున్నగు శాక్యరాజకుమారులు బౌద్ధభిక్షుకులై సంఘమునఁ జేరిరి. బుద్ధుఁడు కపిలవస్తుపురమును వీడి మల్ల కోసల రాజ్యముల ధర్మప్రచారము సలిపి, భిక్షుసంఘమును విస్తరించెను.

బుద్ధుఁడు ప్రాతఃకాలమున మేల్కొని స్నానమాచరించి యేకాంతధ్యాననిమగ్నుఁడయ్యెడివాఁడు. తరువాత విహారమును వీడి యొంటరిగాఁ గాని భిక్షుకులతోఁ గలిసి గాని సమీప గ్రామముల భిక్షాటనము సలిపెడి వాఁడు. గృహస్థులు, గృహిణులు, బుద్ధభగవానుని యాగమనమును ప్రతీక్షించి నానావిధ భక్ష్యభోజ్యముల సమర్పించెడి వారు. బుద్ధుని భిక్షుసంఘ సమేతముగఁ గొందఱు గృహస్థులాహ్వానించెడి వారు. అట్టి యాహ్వానముల బుద్ధభగవానుఁడప్పుడప్పుడు మన్నించెడి వాఁడు. భోజనానంతరము ధర్మప్రబోధము. కథారూపమునఁ, ప్రశ్నోత్తర రూపమున సంవాదసూత్రరూపమున సోపాన క్రమమున బుద్ధబోధలు వ్యాప్తి గాంచెడివి. గ్రామములనుండి విహారమునకేతెంచి పాద ప్రక్షాళనానంతరము బుద్ధుఁడు భిక్షుసమావేశమున ధర్మోపదేశము సంస్పృచుండెడి వాఁడు. ఆరామమున గ్రామీణులకు బుద్ధుఁడు ధర్మోపదేశము సలుపుచుండెడి వాఁడు. పద్మాసనాంకితుఁడై, ధ్యాన నిమగ్నుఁడైన బుద్ధునిఁ గాంచి

సంసారక్లేశ పరితప్తులైన ప్రజ లద్భుతానంద పరవశులై యతిలో క శాంతి ననుభవించెడి వారు. ధ్యాన ముద్రాముద్రితుఁడు, నర్థ నిమీలిత నేత్రుఁడు నైన బుద్ధుని నిదిధ్యాసలో ననుచ్ఛ్వాసిత మయ్యె దివ్య శాంతి సందేశము దిగ్దిగంతములఁ బ్రజల హృద యాంతరాళములఁ గ్రమ్ముకొనుచుండెడిది.

రాజగృహమున నొక శ్రేష్ఠి బుద్ధుని, భిక్షుకసంఘ మును దన యింట భిక్షావందనముల కాహ్వానించెను. అతని బావమరది యనాథపిండకుఁ డా విందున కేతెంచి బుద్ధభగ వానుని సందర్శించి యానంద తన్మయుఁ డయ్యెను. బుద్ధుని భిక్షు సంఘమును, వారి శాంత గంభీర సుప్రసన్న వదనములను గాంచి లౌకిక క్లేశచ్ఛన్నమైన బ్రదుకు తుచ్ఛముగాఁ దలపోయ సాగెను. ఉదయముననే యతఁడు బుద్ధభగవానుని సందర్శించి "భగవన్ రాత్రి తమకు సుఖముగా నిదుర పట్టినదా ?" యని కుశలప్రశ్నమునఁ బరామర్శించెను. బుద్ధభగవానుఁడు మందహాస మండన విలసత్కపోలుఁడై "రోషరహితుఁడు, వాం ఛావిహీనుఁడు, నిర్భయుఁడు, నిర్లిప్తుఁడు నెల్లప్పుడు సుఖనిద్ర చేయుచునే యుండును. నిర్వాణ ప్రాప్తుఁడు నిత్యానంద శీలి" యని ప్రవచించెను. అనాథపిండకునకు నిర్మల సాధు భిక్షు జీవి తమే పరమార్థ మని దోచెను. అతఁడు తథాగతు నాశ్రయించి శరణత్రియదీక్ష గైకొని బుద్ధోపాసకుఁ డయ్యెను. అతఁడు బుద్ధుని శ్రావస్తీనగరమున కాహ్వానించెను.

బుద్ధుఁడు ధర్మప్రచారార్థము దేశదేశములఁ దిరుగా డెను. ఆ యాత్రలలో వర్షాకాలమున మాత్ర మొక విహార

మున నుండెడి వాఁడు. అనాథపిండకుని యాహ్వానము నంగీక
రించుచు బుద్ధుఁడు, తథాగతులు శూన్యాగారముల నగరముల
వెలుపలి ప్రశాంతసీమలలో నుండఁదలతురని చెప్పెను.

అనాథపిండకుఁడు బుద్ధునిచే ననుజ్ఞాతుఁడై శ్రావస్తీ
నగరమున కరిగెను. అచట బుద్ధదేవుని కనువగు విహారమును
నిర్మించుటకొఱకుఁ దగిన స్థలము నన్వేషింప సాగెను. అచ్చట
జేతరాజకుమారుని యుద్యానవనవాటిక యనాథపిండకుని
నాకర్షించెను. అచట విహారమును నిర్మించిన లోకోత్తర మనో
జ్ఞముగ నుండును కాని—రాజకుమారుని దా యుద్యానవనము.
అనాథపిండకుఁడు జేతరాజకుమారుని కడ కేగి యుద్యాన
వాటికను విక్రయింప వేడెను. రాజకుమారుఁ డుద్యానవాటిక
నంతను సువర్ణనిష్కములచేఁ గప్పినఁ గాని విక్రయించుటకు సం
సిద్ధుఁడు కాలేదు- అనాథపిండకుఁడు సమ్మతించెను. అనాథ
పిండకుఁడు తన సర్వస్వమును వెచ్చించి యుద్యానవాటికను
సువర్ణనిష్కములచేఁ గప్పసాగెను. చివరకు ద్వారసీమ మాత్రమే
మిగిలెను. అనాథపిండకుని ధర్మపరత్వమునకు జేతరాజకుమా
రుఁ డచ్చెరువొంది, ద్వారభాగమును దన దానముగా గ్రహింప
నతని వేడుకొని తాను గూడ బుద్ధోపాసకుఁ డయ్యెను. రాజ
కుమారుఁడు బుద్ధసంఘమునఁ జేరుట కనాథపిండకుఁడు సంతో
షించి దానికే సమ్మతించెను.

జేతవనవిహారము, పరివేణము కొట్టములు, సభాగృహ
ములు, విహారశాలలు, స్నానాగారములు, పుష్కరిణులు,

మండపములతో వెలసినది. బుద్ధభగవానుఁ డా జేతవనవిహారమునఁ జాలకాలము ధర్మప్రబోధము సల్పుచు నివసించెను.

బుద్ధభగవానుఁడు పూర్ణపురుషాయుష మనుభవించి వివిధప్రాంతముల ధర్మప్రబోధమును సల్పెను. వైశాలీనగరమున నంబపాలి వనవిహార క్షేత్రమున నివసించు చుండగా బుద్ధుఁడు వ్యాధిగ్రస్తుఁ డయ్యెను. ఆ వర్షాకాలమున భిక్షుకుల నచ్చట నివసింప నాదేశించి బుద్ధుఁడు వేణుగ్రామమున కరిగెను. అచ్చట మూఁడుదినము లాతఁడు రక్తగ్రహణిచే బాధ నొందెను. నాల్గవ నాఁటకు బుద్ధుఁడు స్వస్థతఁ జెందిన పిమ్మట నానందుఁడు సంతోషించి, గురువుగారికి నభివాదముల నర్పించెను. బుద్ధభగవానుఁడు చిరునవ్వు లొలికి, "జీర్ణావస్థ నొందిన శరీరముతోఁ బొత్తుఁ దొలఁగు కాల మాసన్న మైన" దని వచించెను. తథాగతుని యాసన్న పరినిర్వాణ మానందుని హృదయమును మిక్కిలి కలవర పెట్టసాగెను. బుద్ధుఁ డానందునితోఁ గలిసి పావాగ్రామమున నామ్రవనవిహారమున కరిగెను. ఆ విహారమును గట్టించిన చుందకర్మారపుత్రుఁడు బుద్ధుని, భిక్షుక సంఘమును బూజించి పెద్దవిందు చేసెను. అదియే బుద్ధదేవుని తుది భోజనము.

బుద్ధదేవుఁ డచటినుండి కుసినార యందలి సాలవన విహారమున కేగెను. ఆనందునిఁ బిలిచి బుద్ధుఁడు, తన కళేబరమును సుగంధ కాష్ఠముపైఁ దైలద్రోణి నిక్షిప్త మొనర్చి యగ్ని సంస్కార మొనర్చి, స్మారక స్తూపమును నిర్మింప నాదేశించెను. ఆనందుఁడు వెక్కి వెక్కి యేడ్వసాగెను. బుద్ధుఁ డతని వారించి,

"ఆనందా! శోకింపకుము. పుట్టిన వారికి గిట్టక తప్పదు. నిర్వాణ ప్రాప్తి నొందెడి తథాగతునకై దుఃఖింప నేల? ధర్మప్రచారము చేసి నీవు కూడ ముక్తుడవు కాగలవ"ని యతని నోదార్చెను.

తథాగతుని యాసన్ననిర్వాణవార్త కుసినారవాసుల దుఃఖమున ముంచెను. ఆ రాత్రి సాలవృక్షచ్ఛాయలో బుద్ధభగవానుడు ధ్యానసమాధిని గడచి, నాకాశానంత్యాయతన ప్రాప్తినొంది మహా పరి నిర్వాణమును జెందెను.

కుసినారవాసులు తండోపతండములుగ నరుదెంచి బుద్ధభగవానుని తుది సందర్శనము చేసికొనిరి. భిక్షుకులు కుసి నారవాసులు తథాగతుని పవిత్ర కళేబరమును నూత్న వస్త్రాలంకృతము జేసి తైలద్రోణి నిక్షిప్తము గావించి, పరిమళ కుసుమ సంపూజిత మొనరించి "ముకుట బంధన" చైత్యమున సుగంధ కాష్ఠమునఁ బూజాప్రణామములతో నగ్నిసంస్కారము గావించిరి.

బుద్ధశిష్యులా పవిత్ర చితాభస్మమును దంత, చందన, స్వర్ణమణి కరండములం దిడి, మహాచైత్యవిహార హార్మ్యములను విహారములను నిర్మించిరి. బుద్ధధాతువులను భిక్షుకులు నానా ప్రాంతములకుఁ గొనిపోయిరి. బుద్ధుని యస్థికలను, దంతములను, నఖలేశము లైనఁ జేర్చి తరువాతఁ బ్రజలు మహారాజులు చక్రవర్తులు మనోజ్ఞస్తూపముల నిర్మించిరి. అశోకచక్రవర్తి కాలమున భారతదేశము, ప్రాచ్యఖండములోని సింహళ, కళింగ ద్వీపసముదాయము, చంపా సువర్ణ భిబెట్టు చీనాదేశములు

బుద్ధుని ప్రబోధముల నౌదలఁ దాల్చినవి. శిల్పులు పర్వతపాషాణముల దొల్చి బుద్ధదేవునికి దివ్యమందిరములు నిర్మించిరి. చక్రవర్తులు రాజ్యజిగీష నుజ్జగించి ధర్మచక్రమును బూజించిరి. బుద్ధభగవానుని యుద్భవము మానవజాతికే గాక, సమస్త జీవకోటికి మహోదయము. జీవహింస కూడదని దుందుభివాక్యనాదములఁ బ్రపంచమున కెలుఁగెత్తి చాటిన భూతదయామయుని ప్రబోధఫలితముగాఁ లోకమున నెందఱో నేటికిఁగూడ శాఖాహారులుగ నున్నారు. ప్రపంచ చరిత్రలో నే మానవుని యవశేషములునను బుద్ధభగవానుని పవిత్రాస్థికల వలె చారిత్రాత్మిక ఘనాఖ్యత నందలేదు. బుద్ధుని యహింసావాదము, సాధుశీలత్వ జగద్ధితాకాంక్ష సౌశీల్యపరత, యిహలోకమునే స్వర్గలోకముగఁ దీర్చి దిద్దుటకు మహోదారమగు సాధనను గల్పించెను. రాజపుత్రులు, రాజకన్యకలు నంతఃపురమునువీడి, విశ్వశ్రేయము కొఱకు వసుధైకకుటుంబులై జీవితమును నొడ్డి ఖండ ఖండాంతరముల బుద్ధభగవానుని దివ్యప్రబోధమును వెలయించిరి. యుగయుగాంతరముల ఖండ ఖండాంతరముల ముముక్షువులకు బుద్ధభగవానుని జన్మభూమి పవిత్ర తీర్థయాత్రాస్థల మైనది.

బుద్ధభగవానునిఁ గన్న భారతదేశము నిత్యపవిత్రపుణ్యసీమగాఁ జరిత్రలో స్థిరకీర్తి నార్జించుకొన్నది.



# ఏసు క్రీస్తు.

పాలస్తీనా దేశమున బెత్లెహేము నగరమున నొక సత్రము ప్రక్కఁ గల పశువుల కొట్టము ఏసు క్రీస్తు జన్మస్థలము. ఏసు క్రీస్తు జనయిత్రి మరియ కన్య, యామె భర్త యోసేపు బెత్లెహేము నగరమునకు జనసంఖ్యలెక్కలలో నమోదు కాబడుటకు వచ్చియుండిరి. ఆకాలమున పాలస్తీనా రాజ్యము రోమక సామ్రాజ్యము లోనుండెను. ఆగస్టసు చక్రవర్తి యాజ్ఞ చొప్పున జనసంఖ్య లెక్కలు జరుగుచుండెను. యోసేపు మరియు సుప్రసిద్ధులైన అబ్రహాము దావీదుల ప్రవక్తల వంశములకుఁ జెందిన వాఁడు జనసంఖ్యా లెక్కలలోఁ దన వంశగౌరవమును నమోదు చేయించుట యోసేపునకు సంతోషగర్వదాయకము. అందుచే గర్భవతి యైన మరియకన్యతోఁ గలసి, స్వగ్రామ మైన నజరేతు నుండి యాత్మవంశీయుఁ డైన దావీదు నివసించి న బెత్లెహేమును జేరుకొనెను. బెత్లెహేము నగర మంతయు జనాభాలెక్కల కొఱకు వచ్చిన ప్రజలతోఁ గిక్కిరిసియుండెను. యోసేపు మరియల కా నగర మందలి సత్రములో విడిది దొరకలేదు. అందుచే నాసన్నప్రసవ యైన మరియ, యోసేపు సత్రము ప్రక్కనున్న యాలీవు తోపులోఁ బశువుల కొట్టమున నుండ వలసి వచ్చినది. ఆరాత్రి మరియకన్య ఏసు క్రీస్తును బ్రసవించి, పొత్తిళ్లతో నా శిశువును గోలెములోఁ బరుండఁ బెట్టెను. సమీపపర్వత ప్రాంతమునుండి గొఱ్ఱెల కాపరులు కొందఱు వచ్చి యా శిశువును సందర్శించిరి. జగద్రక్షకుఁ డైన ప్రభు వవతరించి నట్లు వారు

దేవమాతల వలన తెలిసికొని, యాత్రికులు శిశువును జూడ వచ్చి నమస్కరింగించిరి. మరియనెక్క కంతకు ముందే దేవమాత దర్శన మిచ్చి భగవత్ప్రసాదమున నామెకు జగద్రక్షకుం డుద్భవింపం గలండని తెలిపియుండెను. మరియు భగవద్ధ్యానముతోం దివ్యాని భావములతో శిశూదయమున కెదురు చూచుచుండెను. ఆమె గర్భము ఫలించెను.

ప్రాచ్యపండితులు కొందఱు వచ్చి మరియశిశువును సందర్శించిరి. జ్యోతిశ్చక్రమున వారికి మహాకాంతి పుంజమైన నక్షత్రము గోచరించెను. ఆ నక్షత్రోదయము జగద్రక్షకుండైన నూత్నపవిత్ర జన్మసూచక మని, భావించి, వారా పవిత్ర శిశువు నన్వేషించుచు బయలుదేరి బెత్లెహేమును జేరిరి. అప్పటిం ప్రభువు హేరోదు. ప్రాచ్యపండితులాతని సందర్శించి తమ యాగమనపరియోజన మెఱిగించిరి.

హేరోదు మిక్కిలి క్రూరుండు. అతండు దురాక్రమణము వల్లనే రాజ్యమును సంపాదించెను. అతని చరిత్ర రక్తకళంకితమైనది. అతండు పీఠాధిపతులను, సామంతులను జంపించెను. క్రీడావ్యాజమున బావమఱదిని నీటిలోం ద్రోయించి చంపించెను. అతని క్రోధద్వేషముల కాతని భార్యలు పుత్రులు గూడ నాహుతి కావలసి వచ్చినది. దుర్మార్గములు, దోపిళ్లు, దౌర్జన్య హింసాకాండ యాతని రాజ్యమున పరిపాటి యయ్యెను. హేరోదు రాజ్యమున హత్య కాబడిన వారికంటె మిగిలినవారి బ్రదుకులే దుర్భరములైనవని యూదుల ధాయబారు లగస్టసు

చక్రవర్తికి నివేదించుకొనిరి. ఆనాఁడు యూదులలో నొక ప్రవక్త జన్మమునుగూర్చి యొక ప్రబలవిశ్వాస ముండెడిది. ఒక ప్రవక్త జన్మించి, యూదులకుఁ బ్రభువై జగద్రక్షకుఁడు కాఁగలఁడని యా యుగమువారి సామాన్యవిశ్వాసము.

ప్రాచ్యపండితుల యభిభాషణము క్రూరుఁడైన హేరోదునకు మిక్కిలి వేదన గలిగించెను. అట్టి ప్రవక్తయే జన్మించిన హేరోదు దోషముల కెట్టి శిక్ష గలుగునో! అతఁడు రాజ్యభ్రష్టుఁడు కాక తప్పదు. అతఁడు తన పరితాపమును లోనణంచుకొని, ప్రాచ్యపండితులను, శిశువు నన్వేషించి తనకుఁ దెలుప వేఁడుకొనెను. తాను గూడ నా శిశువునకుఁ బూజావందనము లర్పించుకొందు నని తెలిపెను.

ప్రాచ్యపండితులు హేరోదును వీడ్కొని, పచ్చి బాలెంతరాలైన మరియను దర్శించి శిశువునకుఁ బూజాప్రణామముల నర్పించి భక్తిపూర్వకముగఁ బ్రస్తుతించిరి. వారు తిరిగి హేరోదును దర్శింపలేదు. హేరోదు క్రౌర్యము, దుశ్శీలము వారికి దెలిసినవి. వారికి స్వప్నమున హేరోదు సంకల్పము స్వయంవ్యక్త మయ్యెను. అందుచేత వారు యథేచ్ఛగ వెడలిపోయిరి.

ఎనిమిదవ దివసమున శిశువునకు శుద్ధిసల్పి, నామకరణము సలుపుట యూదులలో ననుశ్రుతముగా వచ్చుచున్న ప్రాచీనాచారము. ఆ సంప్రదాయము ప్రకారము యోసేపు,

మరియు లా శిశువునకు శుద్ధి గావించి, 'యేసు' నామధేయ మిడిరి. యేసు నామము జాషువకుఁ బర్యాయము. జాషువ యన ముక్తి యని యర్థము. జాషువ నామము దేవుని నామమైన యెహోవకు సంబంధించినది. ఆ పేరా నాటి యూదులలో మిక్కిలి పరిపాటి. మరియకన్యకు దేవదూత స్వప్నమున మిచ్చినపుడా పేరే పెట్టుమని సూచించెను. అందుచే బాలునకు "యేసు" నామధేయము సంక్రమించెను.

మరియకన్యక కా నాఁడు దేవదూత మఱియొక విశేషమును దెల్పియుండెను. ఆమెకు దగ్గర చుట్టమైన 'ఎలీసబెతు' కూడ గర్భము దాల్చినది. ముసలితనములో నున్న యామె కూడ నీశ్వరవరప్రసాదమునఁ బుత్రుని గనఁగలదు. మరియకన్యక కా విషయ మచ్చెరువు గొల్పెను.

ఎలీసబెతు భర్త జెకర్యా వృద్ధుఁడు. ప్రార్థనాలయమున ధూపనైవేద్య మిడువర్చకుఁడతఁడు. ధూపసమయమున దేవదూత సాక్షాత్కరించి, యతనికిఁబుత్రుఁ డుద్భవింప గలఁడని చెప్పెను. వృద్ధాప్యమున నున్న దంపతులకు సుతోదయ మెట్లగునని యాతఁడు సందేహించెను. సందేహాత్ముఁడైన జెకర్యాకు దేవదూత, "యీసంగతులన్నియుఁ బ్రత్యక్షానుభవమునఁ దెలిసికొనువరకు నీవు మూగవాఁడవై యుందువ"ని పలికి యదృశ్యుఁడయ్యెను. మూగవోయిన జెకర్యాను గాంచి ప్రజలాతనికి దివ్యదర్శనము గలిగియుండునని యూహించిరి. ఎలీసబెతు గర్భవతి యయ్యెను. ముసలితనమందుఁ జూలాలైన యెలీసబెతు సిగ్గు

పడి మఱుగుననే యుండఁ జొచ్చెను. మరియొకసారి వచ్చి, దేవదూత కథనమును వివరించి యామె నభినందించి పోయెను. ఆమె ప్రసవించి బాలునిఁ గనెను. ఎనిమిదవ దినమున బంధువులా శిశువునకుఁ దండ్రి పేరు ననుసరించి జెకర్యా యని నామకరణము సలుపుచుండగాఁ దల్లి యెలీసబెతు వారించి, "యోహాను" నామమును సూచించెను. వారి చుట్టాలలో నట్టి పేరు గలవారు లేరు. అందుచే వారు తండ్రికిఁ బలక నిచ్చి వ్రాయుమని సంజ్ఞ చేసిరి. అతఁడు పలకపై యోహాను అని వ్రాసెను. అందఱి కాశ్చర్యము గలిగినది. ఆ పిల్లవానికి యోహాను నామధేయమే యుంచిరి. వెంటనే తండ్రి జెకర్యాకు మూగతనము పోయి యతఁడు దేవుని స్తుతించుచు మాటలాడ సాగెను. యోహాను దిన దిన ప్రవర్ధమానుఁ డగుచుండెను.

నలుబదియవ దివసమున నాలయమునఁ 'బ్రతిష్ఠ' సలుపుటకు యెరూషలేము పట్టణమునకు యోసేపు మరియ లేసును తీసికొనిపోయిరి. అచ్చట నొక నిర్మలహృదయుఁ డగు భక్తుఁడు సుమేయోనా బాలకునిఁ దన చేతులలోఁ గైకొని, యతఁడే కారణ జన్ముఁడైన జగదుద్ధారకుఁడు కాగలఁడని స్తుతించెను. వృద్ధుఁ డగు సుమేయోను భక్తుఁడు తన జన్మతరించిన దని సంతోషించెను. అట్లే "అన్న" యనునొక వృద్ధభక్తురాలును శిశువును గాంచి ప్రస్తుతించెను. ఆమె విగతభర్తృక. ఎనుబది నాలుఁ గేడుల పండు ముదుసలి. ఉపవాస దీక్షలతోఁ బ్రార్థనలతో నామె జీవితమును భగవదారాధన కంకిత

మొనర్చియుండెను. ఏసుబాలుని గాంచి, ఇతఁడే జగత్తరించిన పరిరక్త యని ప్రవచించెను. ధర్మశాస్త్రప్రకార మా బాలుని శుద్ధునిఁ గావించి, యోసేపు మరియలు తరలిపోయిరి.

హేరోదు ప్రాచ్యపండితుల పునరాగమనమునకు నిరీక్షించెను. కాని వారి జాడయే లేదు. అందుచే నతఁడు బెత్లెహేము నగర మందలి పసికూనల నంత మొందింపఁ దలపోసెను. యోసేపు మరియలు ఏసుబాలకుఁడు హేరోదు సలుపు నమూలక శిశుహత్యాకాండమున కాహుతి కాకుండుట కీజిప్టుదేశమునకుఁ బ్రవాసులై పోయిరి. బెత్లెహేము నగరమున ముక్కుపచ్చలారని పసికూన లెందఱో హేరోదు క్రూరత్వమునకు బలి యైరి. శిశువధలో సుతులను బోఁగొట్టుకొనిన రాచెలు మాత దీనాలాపములు హృదయవిదారకములు.

హేరోదు మరణించిన తర్వాత యోసేపు, మరియ యేసులను దీసికొని స్వగ్రామ మైన నజరేతునకుఁ దిరిగి వచ్చెను. నజరేతులో యోసేపు వడ్రింగి వృత్తిచే జీవించుచుండెడివాఁడు. అతఁడు భగవద్భక్తుఁడు, సాధుశీలుఁడు యెరూషలేములో జరుగు పస్కాపండుగ కతఁడేటేట సకుటుంబముగ నేఁగుచుండెడివాఁడు. ఏసునకు బండ్రెండేండ్ల వయస్సులో వారు పస్కాపండుగకు యెరూషలేము వెళ్లి యుత్సవానంతరము తిరిగి వచ్చుచుండిరి. సార్థవాహమున నేసుబాలుఁడు కనుపింపలేదు. యోసేపు దంపతులు బాలునికొఱకు వెదకివెదకి మరల యెరూషలేమును జేరుకొనిరి. ఏసు ప్రార్థనాలయమునఁ బండితులు సలుపుచున్న

యాధ్యాత్మిక గోష్ఠిలో నుండెను. అతని నిశిత ప్రశ్నల కా పండితులు ముచ్చటం గొనుచుండిరి. ఆధ్యాత్మిక చింతతో, దేవుని యెడ భక్తితో మానవుల యెడ దయానురాగములతో యేసు దిన దిన ప్రవర్ధమానుఁ డగుచుండెను.

యేసు శైశవమును గూర్చి చారిత్రిక సాక్ష్య మేమియు లభించుట లేదు. ఐతిహ్యమునఁ గొన్ని కథలు కలవు. అతఁడు నజరేతున యోసేపునకు వడ్రంగమున సహాయము సల్పుచుండెడివాఁడని యెంచ వచ్చును. తరువాత సల్పిన ప్రబోధములలోఁ గన్పించెడి వైదుష్యము, పూర్వప్రవక్తల సిద్ధాంతవిమర్శ, యాధ్యాత్మిక పరిజ్ఞానము నీకాలముననే యేసునకు సిద్ధించి యుండ వచ్చును. ఇంచుమించుగ ముప్ప దేండ్లు వచ్చువరకు నేసీ విధముగనే కాలము గడపి యుండవచ్చును.

చారిత్రకముగ నాకాలమును యుగసంధిగఁ బేర్కొన వచ్చును. పాలస్తీనా రాజ్యము గలీలియా దేశము రోమక సామ్రాజ్యములోనివి. గలీలియా దేశమును హేరోదు పుత్రుఁడైన చిన హేరోదు పరిపాలించుచుండెను పీఠాధిపతుల ప్రాబల్య మెక్కువైనది. జగద్విమోచనమునకు రక్షకుఁడైన ప్రవక్త యెవరో యవతరింప వలెను. గత్యంతర మేమియుఁ బ్రజలకు గోచరింపకుండెను. స్వార్థము, మోసము, దురహంకారము పాలస్తీనాలో వీరవిహారము సల్పుచుండెను.

ఎలీసబెత్తుకుమారుఁడైన యోహాను, నిర్మలబ్రహ్మచర్య జీవితమును గడపుచుఁ బ్రజలకు సచ్ఛీలప్రబోధము సలుప

సాగెను. అతఁ డరణ్యములలో, పర్వతగుహాభ్యంతరములలో జగద్విమోచనమును గూర్చి యోచించెను. అతని కంతః ప్రబోధము కలిగెను. అతఁడు జ్యోతిర్మూర్తి. అతఁడు జంగమ ధర్మ ప్రబోధము. అతని చరిత్ర పాపపూరితజగతికి భూకంపము. ఆ మహాశూన్యమున నతనివాక్కు దివ్యవాణియై వినిపింప సాగినది. ప్రజలు సంతోష తండములుగ నతని చుట్టు మూగి యాతని ప్రబోధములను విననారిరి.

'దివ్య రాజ్యము మిమ్మేలు గాక! రెండు చొక్కాలు గల వాఁడొక దానిని లేని వాని కొసఁగు గాక! ఉన్న వారు లేని వారి కాహార మొసఁగుదురు గాక! పరోపజీవనము మంచిది కాదు. ఇతరులను బీల్చి పిప్పి చేయుటకుఁ బ్రయత్నము చేయరాదు.' సైనికుల నుద్దేశించి, యేమానవుని హింసింప వద్దనియు, మృషా నిందారోపణ సలుప వద్దనియు, వచ్చు రాబడితోఁ దృప్తిఁజెంది యుండవలె ననియు నుద్బోధించెను.

యొహాను ధర్మపరిబోధము వాగ్విన్యాసమును వినిన ప్రజ లతఁడే జగద్రక్షకుఁడైన ప్రవక్త యగు నేమో యని తలపోయ సాగిరి. యొహాను వినయగంభీరమూర్తి. "కారణజన్ముఁడైన ప్రవక్తను నేను గాను. ఆ యాధ్యాత్మికజ్యోతిర్మూర్తి, రాగమనమును నేను గూడ కాంక్షించుచున్నాను. ఆ మహానీయుని పాదరక్షల నూడఁదీయుటకు గూడ నా కర్హత లేదు. ఆ మహాను భావుఁడు పరిశుద్ధాత్మతో, దివ్యానుసంధాన మనుగ్రహింపగలఁడ" ని ప్రవచించెను.

ఆ కారణజన్ముఁ డెప్పు డవతరించునో! ప్రజలు పూజ్యనిరీక్షాధానముతో నెదురు చూడ సాగిరి. యొర్దాను నదీతీరమున నిలిచి, యోహాను ప్రజలందఱును 'బాప్తిస్మము' ను పశ్చాత్తాప సంశుద్ధి బొందుఁడని యుపదేశించెను. చేసిన పాపములను జెప్పి పశ్చాత్తాపమును వెలిఁబుచ్చి యోహానువలనఁ బ్రజలు యోర్దాను నదీజలముల బాప్తిస్మమును బొందుచుండిరి.

ఏసు యోర్దాను నదీతీరమును జేరి యోహానునుండి బాప్తిస్మమును బొందఁగోరెను. అప్పటికే యెందఱకో యోహాను బాప్తిస్మ మనుగ్రహించియుండెను. కాని, యతిలోక తేజస్వియైన క్రీస్తును గాంచి, "నీ దగ్గరనుండి నేనే సంశుద్ధి పొంద వలయును. అట్టి నన్నా నీవు వేడునది?" ని యోహాను బ్రశ్నించెను. కాని క్రీస్తున కది నిర్దిష్టదైవ సంకల్పముగ గోచరించెను. అట్లే కానిమ్మని యోహా నాతనికి బాప్తిస్మము నిచ్చెను.

ఏసు యొర్దాను నదీజలములఁ గుప్రుకు లిడెను. దోషరహితుఁ డైన యతనికి వేరు సంశుద్ధి యేల? అంతఃప్రేరణచే యోహానును బాప్తిస్మమునకై క్రీస్తర్థించెను. పరిశుద్ధాత్మ, వెలుఁగు వెల్లువఁ జిమ్ముచు, గపోతయానమున నేసు నావహించెను. అతఁడే దేవుని యనుఁగు బిడ్డఁ డైన క్రీస్తు మహాప్రవక్త యను దివ్యవాణి యస్ఫుటముగ యోహాను చెవులలో గింగురు మన సాగిన ట్లనిపించెను. క్రీస్తనగా నభిషిక్తుఁడు. భూలోకమున దివ్యరాజ్యము వెలయించుటకుఁ గారణజన్ముఁడై యవతరించిన భగవద్వర ప్రసాది యైన యేసు క్రీస్తు సార్థకనామధేయుఁడు.

మహాభక్తుఁడైన యోహాను తన ప్రబోధములలో నిర్భయముగ సహనీతి, కాపట్యమును ఖండించెడి వాఁడు. త్యాగయోగ్యుఁడైన యోహాను చరిత్ర చిరస్మరణీయము. రోమక సామ్రాజ్యమును కన్నాడు సింహాసనమున కప్రతిష్ఠ తెచ్చిన తిబెరి కైసరు చక్రవర్తి. నిరంకుశ దుష్ప్రభుత్వమును నెరపుచు మన్ను మిన్ను గానని పొంతిపిలాతు యూదుల కధిపతి. గలిలైయ మండలమునకుఁ గ్రూరుఁడైన హేరోదు ప్రభువు. 'అన్నయు' 'కయపయు'లు ప్రధానయాజకులు. హేరోదు దుర్మార్గపథమును యాజకుల దురహంకారమును, యోహాను నిర్భయముగ ఖండించుచుండెడి వాఁడు. యోహాను పాపక్షమాపూర్వక మైన పశ్చాత్తాపసంశుద్ధి ప్రబోధించు చుండెను.

పరిశుద్ధాంతరంగుఁడై యొర్దాను నదీతీరమునుండి తిరిగి వచ్చిన నాటి రాత్రి యేసుక్రీస్తు ధ్యాననిమగ్నుఁడై యుండెను. అరణ్యసమీపమున నతఁ డన్నో యాహారము గైకొనక ధ్యానించు చుండెను. అది యతనికిఁ బరీక్షాసమయము. అతఁడు కారణజన్ముఁడు. ఈశ్వరపుత్రుఁడైన మానవకుమారుఁడు. అతఁడు ప్రపంచము నుద్ధరించుటకుఁ బూనుకొనవలసి యున్నది. అతని కాకలి వేసిన,-నీశ్వరకుమారుఁడు తనయాజ్ఞచే రాతిని రొట్టెగా మార్చు లేఁడా?-అది ప్రశ్నయే కాదు. మానవుఁడు జీవించుటకు రొట్టె యొక్కటే యావశ్యకము గాదు దేవుని కుమారుఁడైనచో యెరూషలేము ప్రార్థనాలయ శిఖరమునుండి యొక సారి దూకి చూడ వచ్చును. అప్పుడతని పాదము రాతికిఁ దగులకుండ దేవదూత వచ్చి కాపాడునా? ఈపైశాచిక ప్రశ్నల కత్య

డతీతుఁ డయ్యెను. జగత్ప్రభు వైన పరమేశ్వరునే పరీక్షింప రాదు. భక్తి విశ్వాసములతో స్థిరసంకల్పముతో యేసు క్రీస్తు పరమేశ్వరు నారాధింప సాగెను.

బాప్తిస్మమును బొందిన మఱునాఁడు, యోహాను శిష్యులతోఁ గలసియుండగా సమీపమునుండి యేసు తరలిపోవుచుండెను. ఏసును శిష్యులకుఁ జూపి యోహాను, "చూడుడు. దేవుని గొఱ్ఱె తరలి పోవుచున్న" దని పలికెను. ఆ శిష్యులు తరువాత యేసుక్రీస్తును జేరిరి. ఏసు క్రీస్తు మానవ హృదయములను బరిపాలించిన దివ్య ప్రభువు. యోహాను శిష్యులు దయారసపూరితము లైన యేసుక్రీస్తు కరుణనేత్రదీధితులు, జగద్ధితాకాంక్షాపూరిత మైన యాతని యాధ్యాత్మిక ప్రభుత్వమునకు సమ్మోహితు లైరి. వారే యేసుక్రీస్తునకుఁ దొలి శిష్యులు. ఏసు శిష్యులకుఁ బ్రజలకుఁ బ్రబోధము సల్పుచు దేశాటనము సలుప సాగెను. ఏసు సల్పిన యద్భుత కృత్యము లనేకములు. ఏసు మహాత్త్వమును నీ లోకోత్తర గాథలు స్వయంవ్యక్తము చేయు చున్నవి.

కుష్ఠరోగముతో బాధ పడుచున్న యొక రోగి యేసును బ్రార్థించి రోగవిముక్తుఁ డయ్యెను. పక్షవాతముతో బాధపడు మనుష్యుఁడు స్వస్థత గాంచెను. ఏసు క్రీస్తు మహిమ విని రోగులు ప్రజలు గుమిగూడ సాగిరి. అతఁడు విశ్రాంతిదినము నఁ బ్రబోధము సలుప సాగెను. ఇది శాస్త్ర విరుద్ధ మని యాజకులు దూషింప సాగిరి. విశ్రాంతి దినము నాఁడు రోగులను జేర్చుచుండుట గాంచి వా రధిక్షేపించిరి. దయామ

యుండైన యేసు క్రీస్తు "ప్రాణహింస ధర్మమా? ప్రాణరక్షణ ధర్మమా?" యని పూర్వపక్షమును నెలకొల్పుచుఁ బ్రశ్నించెను.

మతాచార్యులలో యాజకులలో నేసు సంప్రదాయ విరుద్ధముగా సంచరించు నేకప్రవక్త యను దురభిప్రాయము కలిగెను. ఏసుపైఁ బ్రజలు చూపించు గౌరవ మర్యాదలు పూజ్య భావము వారికి ద్వేషాసూయల రగుల్కొల్పెను. పాపులను క్షమించుటకు కితఁ డేమైనఁ బరలోకము దేవుని ప్రతినిధియా? ఎత్తిన నేసు పరిభవమును ద్విగుణము చేయుదమని ప్రతికక్షులు వాదించు చుండిరి. గురువేసిలు, దీనులు రోగార్తులు, పతితులు యేసు చుట్టు మూఁగుచుండిరి. ఒకసారి, మతాచార్యులు శిష్యులను 'మీ గురువేల పాపులతోఁ దిని త్రాగి తిరుగు చున్నాఁ'డని ప్రశ్నించిరి. పతిత పావనుఁడైన యేసు క్రీస్తు ప్రభువు, "రోగులకే వైద్యుఁడు కావలిసినది. పుణ్యాత్ములకు నీతిప్రబోధము వేల? పతితుల నుద్ధరించుటయే నా కర్తవ్యము. కావున వారితోఁ గలిసియుండుట నా విధి" యని సమ్యక్సమాధాన మిచ్చెను. ఏసు క్రీస్తు మెట్టిన చోట దివ్యశాంతి యావిర్భవించు చుండెడిది. అతని సాన్నిధ్యమున హృదయములు పావనము లయ్యెడివి. రోగు లారోగ్యవంతులై నిలిచెడి వారు. దయ్యము లావహించినవారి కేసుసందర్శనమే శాపవిమోచనము. ఏసు నొక భూతమాంత్రికుఁ డని ప్రజలను మోసగించు దగాకోరని యాజకులు ప్రచారము కావింపసాగిరి.

ఏసు క్రీస్తు గిరిశిఖరప్రబోధము చిరస్మరణీయము. ఒక నాటి రాత్రి యేసు క్రీస్తు పర్వతశిఖరము నధిరోహించి ధ్యాన

నిమగ్నుఁడై యుండెను. ఉదయమునకుఁ దే శిష్యులను జేర్చి, వారి నుండి పండ్రెండుగురి ముఖ్యుల నేర్పరచెను. వారికే అపోస్తలు లని పేరు. వారు సీమోను. పేతురు, అందేయ, యాకోబు, యోహాను, ఫిలిప్పు, బర్తొలొమయి, మత్తయి, తోమా, అల్ఫయి యాకోబు, జెలోతే సీమోను, యూదా, ఇస్కరియోతు యూదా యను వారలు. ఏసు బోధ వినుటకు శిష్యులు, శిష్యప్రముఖులే గాక, పరిజ లెందఱో పర్వతము దరి నున్న మైదానమును జేరిరి. కొందఱు రోగార్తులు స్వస్థ నందుటకు దివ్యవైద్యుని నన్వేషించుచు వచ్చిరి. నిరు పేదలు, దీనులు యెరూషలేము, వాలక్కీనాలనుండి తరలి వచ్చిరి. ఏసుక్రీస్తు కిక్కిరిసి యున్న జన సామూహమునకుఁ దన యమృతసందేశమును వినిపించెను.

“నిరు పేదలే ధన్యులు. దేవుని రాజ్యము వారిదే. ఆకొని యున్నవారికే తృప్తి కలుగును. ఐహిక కష్టము లనుభవించు చున్న మీరు ధన్యులు. మీరు శోకమును గడిచి యానంద మనుభవించెదరు. మీదే స్వర్గసుఖము. అయ్యో ధనవంతు లారా! దుఃఖశీలురు, మీరేకదా! ఉన్నవార లైనను, యథార్థమునకు సర్వము కోలుపోవుచున్న వారలు మీరే! మిథ్యాసౌఖ్యము నిలువదు. మీరు దుఃఖింపక తప్పదు. ఇప్పుడే నా మాట లాలకింపుడు.

శత్రువులఁ బ్రేమింపుము. అపకారి కుపకారము సలుపుము. దూషించిన వారిని సంభావింపుము. బాధించిన వారికే మేలు తలపెట్టుము. ఒక చెంపమీదఁ గొట్టిన వానికే

రెండవ చెంపఁగూడనొగ్గుము. నీ యుత్తరీయమును లాగుకొనిన వానికే యంతరీయమునుగూడ నిచ్చివేయుము. ఒరులు నీ యెడ నెట్లు మెలఁగ వలయు నని యెంతువో యట్లె యితరులయెడ నడచుకొనుము. నిన్ను ప్రేమించిన వారినే తిరిగి ప్రేమించుటలో విశేష మే మున్నది? మేలు చేసిన వారికే మేలు తలఁపోయుట నీలో మెప్పును సూచింపదు. పాపులుగూడ ప్రేమించిన వారిని ప్రేమింతురు. మేలు చెయుదురు. అది సర్వసామాన్యము. శత్రువులఁ బ్రేమింపుము. ప్రతిఫలాపేక్ష వీడి, సదా యుపకారశీలివై మంచిచేయుము, సర్వోన్నతుఁడైన యీశ్వరునకు బిడ్డలైన వారు, కృతఘ్నులకు, దుష్టులకుఁ గూడ దయార్ద్రబుద్ధితో హితమాచరించెదరు. దయాశాలివై మెలఁగుము. జగత్పితయైన యీశ్వరుఁ డఖండ దయానిధి. ఇతరులయెడ రంధ్రాన్వేషణము సలుపకుము. అప్పుడు నీవు దోషదూరుఁడవు కాఁగలవు. నిందింపకుము. నీవు కూడ నిందాదూరుఁడ వగుదువు. క్షమాశీలి వగుము. నీకు క్షమ లభించును. దానపరుఁడ వగుము. నీ కుపకృతి లభించును. గురుఁడు మార్గదర్శి. శిష్యుఁడు గురుఁడు సములా? గ్రుడ్డివాఁడు గ్రుడ్డి వానికే దారి చూపఁగలఁడా? సిద్ధుఁడైన శిష్యుఁడే గురువుతో సమానుఁ డగును. వేషధారీ! ఒరుల తప్పులెన్నుటకు ముందు నీ తప్పులను దిద్దుకొనుము. ఒరుని కంటిలోని నలుసు కనుపించి నట్లు, తనకంటిలోని పుల్లు కనుపించదు. మంచి చెట్టు మంచి పండ్లు కాయును. మంచి మనసు కలవాఁడు మంచి మాటల నాడును. మంచి పనులే చేయును. నన్ను జేరి 'ప్రభూ!' సంబోధమున వ్యర్థభక్తిచూపినఁ

ప్రయోజనము లేదు. ఆశయములనాచరణలో ననువర్తింపుము."

ఏసుక్రీస్తు ప్రబోధమును ముగించి, పర్వతశిఖరమును విడిచి కపెర్నహేములోని కరిగెను.

ఇట్లు వివిధప్రదేశములలో యేసుక్రీస్తు ప్రబోధము నలువ సాగెను. అతని మహిమనుగూర్చి లోకులు చెప్పుకొన సాగిరి. కపెర్నహోములో నతఁడొక కింకరుని రుగ్మత బాపెను. నాయీను గ్రామమున నొక విగతభర్తృక యేకైక సుతుని పునరుజ్జీవితుని సల్పెను. పాలస్తీనా దేశ మంతంతట నీ గాథలు వ్యాపించినవి. దేవుని మహిమ నెరుక పరచు చున్న ప్రవక్త యుద్భవించె నని ప్రజలు నలుగడలఁ జెప్పుకొన సాగిరి. ఈ వృత్తాంతములు యోహాను చెవి సోకినవి. అతఁడు శిష్యుల నిద్దఱఁ బిలిచి యేసు క్రీస్తు దగ్గరకుఁ జని "నీవేనా యావతారపురుషుఁడవైన యుద్దిష్ట ప్రవక్తవు. లేదా జగదుద్ధారకుని కొఱకై మే మింకను నిరీక్షింప వలసి యున్నదా? వచింపుము"ని యడుగు డని పంపెను. యోహాను శిష్యు లేసు క్రీస్తును జేరి యా ప్రశ్నల నడిగిరి. ఏసు క్రీస్తు ప్రభువు, వారికిఁ జేరిన జనసమూహమును జూపెను- రోగులు, దీనులు, నిరుపేదలు యేసు క్రీస్తును భజించు చుండిరి. పుట్టుగ్రుడ్డివారికిఁ గనుచూపు వచ్చినది. కుష్ఠరోగులు స్వస్థతఁ జెందిరి. మృతులు గూడ పునర్జీవితు లగుచున్నారు. ప్రజలందఱు ఇట్టి కథలనే యా శిష్యులకు వినిపించిరి. ఏసు తానే యవతరించిన జగదుద్ధారకుఁడైన ప్రవక్త నని చాటుకొన లేదు. యోహాను శిష్యులు కనిన దానిని వినిన దానిని తమ గురువునకు విన్నవించుట కేగిరి.

యోహాను శిష్యులేగిన తరువాత ప్రజల నుద్దేశించి యేసుక్రీస్తు సంభాషింప సాగెను. "ఈ జగత్తు యోహాను వంటి యుత్తము పురుషు నింతవరకుఁ బ్రసవింప లేదు. అతని యందు మీ రేమి విశేషమును గనిపెట్టఁగలిగినారు? అతఁ డరణ్యములలో నున్నాఁడు. ప్రశస్త వస్త్రములను దాల్చి రాజభవనములలో జీవించు సుఖలాలసులను జూడ లేదా మీరు? యాజకులు, దంభాచారులు, స్మృతిశాస్త్రవేత్తలతని నిరాకరించి, సంశయాత్ములు కాకున్నారు. ఈ పురుషాంతరము లోని ప్రజలను దేనితో సరిపోల్చవలెనో తోచకున్నది. అవివేకులై వారి స్వార్థపరులై జ్ఞానరహితులై యున్నారు. కొంద్ఱు తినక ద్రాక్షాసవ పానక జీవితమును గడుపు యోహానునకు దయ్యము పట్టిన దనుచున్నారు. కొంద్ఱు యాసవముల స్వీకరించిన మానవకుమారుని తిండిపోతు మద్యపాయి పతిత మిత్రుఁడని దూఱుచున్నారు. యథార్థమును జ్ఞానులే తెలిసికొనఁగలరు." దీనిఁ బట్టి యేసుక్రీస్తునకు యోహానుపైఁగల సదభిప్రాయము వ్యక్తమగుచున్నది. యేసుక్రీస్తు మఱియొకచోటఁ జెప్పిన యుపాఖ్యానమునుబట్టి యతని బోధ లెట్లు పరిణమించెనో యూహింపవచ్చును. "ఒకఁడు విత్తనముల నాట సాగెను. కొన్ని గింజలు బాటప్రక్కఁ బడినవి. తెరువరులు వాని ద్రొక్కివేసిరి. పక్షులు కొన్నిటిఁ దినినవి. కొన్ని గింజలు రాతినేలపైఁ బడి నీరు లేక మొలువనే లేదు. మఱి కొన్ని ముండ్లపొదల సందులలోఁ బడెను. పొదలు మొలిచిన మొక్కల నెదుగకుండ నణచివేసినవి. కొన్ని గింజలు మాత్రమే మంచి నేలపైఁ బడి మొలిచి ఫలించినవి. అధికారులైన శ్రోతలీ

యర్థమును గ్రహించెదరు గాక!" దేవుని సందేశమే యర్థవాద రూపముననున్న పిత్రరము. ఈవిషయము నెలుగెత్తి యేసుచాటి చెప్పెను. సమకాలిన సంఘమున నతని బోధ లీ యుపాఖ్యానము లోనిగింజలవలె నెట్లు సంపూర్ణముగ ఫలింప లేకున్నవో యూహింప వచ్చును. ఏసు స్వీయహృదయవిచ్ఛేదమునే యీ యుపాఖ్యానరూపమున వెల్లడించెను. అతడు ద్వాదశశిష్యులను పిలిచి, తన యుపదేశములను వివిధప్రాంతములప్రజలకు వినిపించి, రోగములను బోగొట్టి యుపచారములు సలుపు డని నియోగించెను.

నిరంకుశక్రూరప్రభుత్వమున నీతి నియమముల దొలంగి యథోగతి పాలైన ప్రజల కా యుపదేశములు చెవి కెక్కంజాలవు. పాలస్తీనారాజ్యమునకుం బాలకుండు నీచుండైన హేరోదు. అతండు రక్తమును బీల్చి ప్రజలను పిప్పి చేయ నచ్చును. రోము నగరమునకేగి చక్రవర్తికి బాసోహాములతోం గప్పములను జెల్లించివచ్చిన చాలును. హేరోదు చక్రవర్తిని దర్శించుటకొరకొకసారి రోమునగరమున కేంగెను. అచ్చటం దండ్రిచేం దరిమివేయంబడిన యతని సోదరుండు ఫిలిప్పాతని కాతిథ్య మిచ్చి గౌరవించెను. ఆయాతిథ్య మర్యాదలకు హేరోదువలన, ఫిలిప్పు పొందిన ప్రతిఫలము విచిత్ర మైనది. హేరోదు సోదరుండైన ఫిలిప్పు భార్యనే తరలించుకొని పోయెను. అది గ్రుడ్డి ప్రేమ యైనంగాదు. ఆమెకప్పటికే యెదిగిన కూతు రున్నది. అతండా వివాహితుండు. ఇదివరకే అరేబియాపాలకుని పుత్రికనువివాహ మాడియుండెను. ఆమెకు రాణికావలెనను దుష్టవాంఛ; అతనికి నీచమైన పరస్త్రీ

వ్యామోహము. అతఁడు తన భార్యను త్యజించి వధించెద నని యామెకు వాగ్దాన మొసగెను. రోము నగరమునుండి వారు తిరిగి రాకపూర్వమే యతనిభార్య పితృగృహమునకుఁ బారిపోయెను. అరేబియా పాలకుఁ డతని మామగా రతనిపై దండెత్తి వచ్చి యుద్ధమున నతని నోడించెను. హేరోదు యుద్ధభూమి నుండి పారిపోయి వచ్చి సిగ్గు లేక దుర్గములో దూరి సోదరుని భార్యతో భోగలాలసుఁడై కాలమును వెళ్లఁబుచ్చ సాగెను. ప్రజ లందఱు హేరోదునకు భయపడి నోరెత్త కుండిరి.

కాని, యోహాను హేరోదు నీచప్రవర్తనను, భోగలాలసత్వమును, దుష్పరిపాలనమును ఖండింప సాగెను. దోషాంతరంగుఁడైన హేరో దా ధర్మప్రవక్తను దన సన్నిధానమునకు రప్పించెను. యోహాను నిర్భయముగ సౌశీల్య సత్ప్రవర్తనలఁ గూర్చి యుపన్యసింప సాగెను. హేరోదు నిత్యజీవితమునఁ దా నతిక్రమించుచున్నను, నా ధర్మములనే యోహాను ముఖమునుండి కుతూహలముతో వినసాగెను. అతనికి యోహాను చెప్పినట్లు నడచుకొన వలయునని తోచెను. అతనిది తాత్కాలిక వైరాగ్యము. అది తెలిసిన యోహాను, సోదర భార్యాసంగమును కంటె వేరు దుర్నీతి లేదని యుద్ఘోషించెను. హేరో దతనిఁ గారాగారమున బంధించెను. కారాగారమే యోహానునకు రాణి కుతంత్రములనుండి రక్షింపగల దుర్గము.

ఒకనాఁడు హేరోదు తన జన్మదినోత్సవమునకు, మిత్రులను సామంతులను ప్రముఖులను దుర్గమున కాహ్వానించెను. అందఱు ద్రాక్షాసవమును సేవించి మత్తిలి యుండిరి. ఆ వినోద

యర్థమును గ్రహించెదరు గాక!" దేవుని సందేశమే యీసద్వాద రూపమునున్న విత్తనము. ఈవిషయము నెలుగెత్తి యేసుచాటి చెప్పెను. సమకాలీన సంఘమున నతని గాథలీ యుపాఖ్యానము లోనిగింజలనలె నెట్లు సంపూర్ణముగ గ్రహింప లేకున్నను యూ హింప వచ్చును. ఏసు స్వీయహృదయసంవేదనమునే గూఢ యుపా ఖ్యానరూపమున వెల్లడించెను. అతడు ద్వాదశశిష్యులను పిలిచి, తన యుపదేశములను వివిధప్రాంతములపల్లెలకు వినిపించి, రోగ ములను బోగొట్టి యుపచారములు సలుపు డని నిర్దేశించెను.

నిరంకుశక్రూరప్రభుత్వమున నీతి నియమములు దొలంగి యధోగతి పాలైన ప్రజల కా యుపదేశములు చెవి నెక్కియుండ లవు. పాలస్తీనారాజ్యమునకు( బాలకుడు నీచుడైన హేరోదు. అతడు రక్తమును బీల్చి ప్రజలను పిప్పి చేయుచు నుండెను. రోము నగరమున కేగి చక్రవర్తికి దాసోహములతో( గప్పములను చెల్లించివచ్చిన చాలును. హేరోదు చక్రవర్తిని దర్శించుటకై యొక సారి రోమునగరమున కేగెను. అచ్చట( దండ్రిచే( దరిమి వేయబడిన యతని సోదరుడు ఫిలిప్పు అతని కాతిథ్య మిచ్చి గౌర వించెను. ఆయాతిథ్య మర్యాదలకు హేరోదువలన, ఫిలిప్పు పొం దిన ప్రతిఫలము విచిత్రమైనది. హేరోదు సోదరుడైన ఫిలిప్పు భార్యనే తరలించుకొని పోయెను. అది గ్రుడ్డి ప్రేమ మైనను గాదు. ఆమెకప్పటికే యెదిగిన కూతు రున్నది. అతడా వివాహితుడు. ఇదివరకే అరేబియాపాలకుని పుత్రిని వివాహ మాడియుండెను. ఆమెకు రాణికావలెనను దుష్టవాంఛ; అతనికి నీచమైన పరస్త్రీ

వ్యామోహము. అతఁడు తన భార్యను త్యజించి వధించెద నని యోహానుకు వాగ్దాన మొసగెను. రోము నగరమునుండి వారు తిరిగి రాకపూర్వమే యతనిభార్య పితృగృహమునకుఁ బారిపో యెను. అరేబియా పాలకుఁ డతని మామగా రతనిపై దండెత్తి వచ్చి యుద్ధమున నతని నోడించెను. హేరోదు యుద్ధభూమి నుండి పారిపోయి వచ్చి సిగ్గు లేక దుర్గములో దూరి సోదరుని భార్యతో భోగలాలసుఁడై కాలమును వెళ్ళఁ బుచ్చ సాగెను. ప్రజ లందఱు హేరోదునకు భయపడి నోరెత్త కుండిరి.

కాని, యోహాను హేరోదు నీచప్రవర్తనను, భోగలాల సత్వమును, దుష్పరిపాలనమును ఖండింప సాగెను. దోషాంత రంగుఁడైన హేరోదా ధర్మప్రవక్తను తన సన్నిధానమునకు రప్పించెను. యోహాను నిర్భయముగ సౌశీల్య సత్ప్రవర్తనలఁ గూర్చి యుపన్యసింప సాగెను. హేరోదు నిత్యజీవితమునఁ దా నతిక్రమించు మనస్సును, నా ధర్మములనే యోహాను ముఖమునుండి కుతూహలముతో విన సాగెను. అతనికి యోహాను చెప్పినట్లు నడచుకొన వలయునని తోచెను. అతనిది తాత్కాలిక వైరా గ్యము. అది తెలిసిన యోహాను, సోదర భార్యాసంగమము కంటె నేరు దుర్నీతి లేదని యుద్ఘోషించెను. హేరో దతనిఁ గారాగారమున బంధించెను. కారాగారమే యోహానునకు రాణి కుతంత్రములనుండి రక్షింపగల దుర్గము.

ఒకనాఁడు హేరోదు తన జన్మదినోత్సవమునకు, మిత్రు లను సామంతులను ప్రముఖులను దుర్గమున కాహ్వానించెను. అందఱు ద్రాక్షాసవమును సేవించి మత్తిలి యుండిరి. ఆ వినోద

మున రాణిపుత్రిక శలోమికన్యక నవయౌవన లావణ్యమూర్తి నాట్యమును సలిపెను. కీర్తిశేషుండైన హేరోదు పౌత్రి, రాణీ పుత్రిక నర్తకియై రాజసౌధమున సమస్తపురుష సమక్షమున లాస్యము సలుపుట ! ఎంతటి వింత !! నీతి యధఃపతనము చెందునపుడు పాతాళమున కడు గుండ జాలదు. ఆ స్త్రీ జనరాలి నాట్యవిన్యాసమున కా భోగపురుషులు తల లూచి యానందించిరి. మత్తెక్కిన హేరోదు ప్రభు వామెకు, 'కోరిన నిచ్చెద న'ని రసజ్ఞతను బ్రకటించెను. ఆ తరుణమునకై రాణి వేచి యున్నది. తల్లి యా దేశమున శలోమికన్య హేరోదు ప్రభువును యొహాను యోగి శిరస్సునే వరముగ నర్థించెను. కారాగారమున నున్న యొహాను యోగి కంటెం దనకు వేఱు ప్రమాదము తెచ్చు వారు లేరని యామె తలపోసెను. నెరయు చున్న శిరోజములు, ముడుతలు పడు చున్న బుగ్గలతో నెంత కాలమో యింక హేరోదు ప్రభువును లో బరచుకొన లేనని యామె భయపడెను. హేరోదులో లేశ మైన బుద్ధి, పౌరుషము, నింగితజ్ఞానము, విచక్షణ యుచితజ్ఞత, యే నైన మిగిలియున్నచో నామె కోరికను ధిక్కరించి యుండెడివాఁడు. ఒకదుర్బల నిముషమును వెదకి యతని మోసగించుటకు జరిగిన కుట్ర యా కోరిక. ఆ వరమును పాలించుట కాతనికి వీలు లేదు. ఇంకొకరి ప్రాణమును దానము చేయుట కాతని కేమి హక్కు గలదు? అనదే యామె వాంఛిత మైనచోం దన మాట నిలుపుకొనుట కంటె నిలుపుకొనకపోవుటచేతనే ప్రతిష్ఠ గౌరవము లభించును. కాని, హేరోదు మంద బుద్ధియై యాలోచన వీడి, కసాయి వాని

నొకనిఁ గారాగారమునకుఁ బంపి యోహాను శిరస్సు ఖండించి తెచ్చుట కాజ్ఞ నొసంగెను.

బుద్ధిహీనుఁడైన యొక దుర్మార్గ నిరంకుశ ప్రభువు నాజ్ఞచే, రక్తపిపాసువైన సౌందర్య యౌవన పిశాచము కోరుకొనిన బలినైవేద్యమునకు, మహానుభావుఁడైన యోహాను యోగి పవిత్రశిరస్సు గండ్రగొడ్డలి వ్రేటునకుఁ గూలి పోయెను. ఆ కాళరాత్రి రాజహర్మ్యమున నా కసాయివాఁడు రక్తసిక్తమైన శిరోజములను బట్టి యోహాను మహాయోగి శిరస్సును కాంచన పాత్రిపై నిడి హేరోదు సమక్షమున శలోమి కన్యకకు బహూకరించెను.

రాణి యోహాను మొండెమును నక్కలు, కాకులు, రాబందులు, తినుటకై బయటఁ బారవేయించెను. ఆ శిరస్సు విషయము చరిత్రకు దురవగాహము. యోహాను శిష్యులా కళేబరమునకు మృతసంస్కార మొనర్చిరి. ఆ శిష్యులలో హేరోదు సపత్ని తమ్ముఁడుగూడఁ గలఁడు. వారు జరిగిన వృత్తాంతము యేసు క్రీస్తునకు నివేదించిరి. యోహాను త్యాగవీరుఁడై యేసు క్రీస్తునకుఁ బూర్వాంగప్రవక్తఁ డయ్యెను.

యోహానుయోగి హత్య యేసుక్రీస్తునకుఁ గర్తవ్యము ప్రస్ఫుటము సలిపెను. ఏసు, యోహానుయోగి యాధ్యాత్మిక పరతను జనసమక్షమున సదవజకే ప్రస్తుతించెను. ఏసతని నుండి బాప్తిస్మమును బొంది యుండెను. యోహానునకు యేసు క్రీస్తునకుఁ గల యాత్మిక సన్నిహితత్వము హేరోదునకుఁ బ్రజలకుఁ దెలిసినదే. యోహాను ప్రబోధములు ప్రజలు వినియుండిరి. ఏసుక్రీస్తు

ప్రబోధముతోఁ బాటత్యద్భుత కృత్యములను సలుపుచుండెను. అతఁడే యుద్దిష్ట ప్రవక్తయను విశ్వాసము ప్రజలలో వ్యాపించుచుండెను. ఏసును గూర్చి హేరోదున కుత్కంఠ యెక్కువయ్యెను. అతఁడే యూదులకుఁ బ్రభువైన ప్రవక్త యగునా? హేరోదు నాప్రశ్న బాధింపఁ జొచ్చినది. యాజకులు, మఠాధిపతులు తమ ప్రాబల్యమును దగ్గించుచున్న యేసు క్రీస్తుపై రహస్య ద్వేషమును వహించి యుండిరి.

ఒకనాఁడు శిష్యులను బిలిచి, యేసు క్రీస్తు "నన్నుఁగూర్చి ప్రజ లేమనుకొనుచున్నార"ని ప్రశ్నించెను. వారు ప్రజలలో వ్యాపించిన విశ్వాసములఁ బ్రకటించిరి. "కొందఱు బాప్టిస్మమిచ్చిన యోహా ననుకొను చున్నారు. మఱికొందఱు పూర్వకాలపుఁ బ్రవక్త యొకఁడు పునర్భవించె ననుకొనుచున్నారు." ఏసు క్రీస్తు, "మీ రే మనుకొనుచున్నార"ని ప్రశ్నించెను. పేతురు "నీవు దేవుని క్రీస్తువ"నెను. ఈ మాటయే లోకమును వ్యాపించిన యాజకులు, సామంతులు హేరోదు, రోమక సామ్రాజ్యప్రతినిధి పాంతిపిలాతుగూడ నేసు క్రీస్తునకు గాఢశత్రువులు కాక తప్పదు. దేవుని క్రీస్తు, నూత్న ప్రవక్త యుద్భవించి యూదులకుఁ బ్రభు వగు నని యాకాలమున వారి విశ్వాసము. ఏసు క్రీస్తు, శిష్యులతో "నీ యభిప్రాయ మెవరితో వెల్లడింపవద్ద"ని యాదేశించెను.

ఏసు క్రీస్తు శిష్యులతోఁ గలిసి ప్రజలలోఁ బ్రబోధము సల్పుచుండెను. 'అయ్యో! ధర్మశాస్త్రోపదేశకులారా! మీరు జ్ఞాన మను తాళపుఁజెవి నెత్తుకొని పోయినారు. మీరు

లోఁ బ్రవేశింపరు. ఇతరులను బ్రవేశింప నివ్వరు." నాటి మతాధి పతులకు గూర్చిన యేసు భావములు వారికి నొప్పి గలిగించెను.

ఒక యధికారి యేసుతో, "మహాజ్ఞానీ! దివ్యజీవితమునకు వారసుఁ డనగుటకు నే నేమి చేయ వలె" నని ప్రశ్నించెను. ఏసు "నేను జ్ఞానినని యేల చెప్పుచున్నావు? దేవుఁడొక్కఁడే పరిపూర్ణ జ్ఞానస్వరూపుఁడు — నరహత్య చేయ వద్దు; పరధనాపహరణము, పరస్త్రీ వాంఛ మొదలైనవి కూడవు. అసత్య మాడకుము. తలిదండ్రులఁ బ్రేమింపుము. ఇవి సచ్ఛీల లక్షణము ల"ని సూచించెను. "బాల్యమునుండి నే నన్నే ప్రవర్తించుచున్నాన"ని యతఁడు మాఱు పలికెను. ఏసు క్రీస్తు "మంచిది. అట్లయిన నీ వనశ్యము చేయవలసిన దింక నొకటి కలదు. నీ సర్వస్వమును నిరు పేదలకుఁ బంచి పెట్టుము. తరువాత నన్ను వెంబడింపుము. నీ కాముష్మిక సౌఖ్యము కలుగఁ గలద"ని ప్రవచించెను. ధనవంతుఁ డైన యా యధికారి కా యుపదేశము మిక్కిలి సంకటముగఁ బరిణమించెను. అతని మనోవ్యథ గాంచి యేసు క్రీస్తు 'ధనవంతుఁడు దివ్యజీవితమును బొందుట కంటె సులభముగా నొంటె సూది బెజ్జ ములో దూర గలద'ను చిరస్మరణీయ మైన సుభాషితమును వెల యించెను.

ఒకనాఁడు ప్రార్థనాలయ సమీపమున నేసు సుభాషిత ముల నాలకించుటకుఁ బ్రజలు గుమి గూడిరి. మతపరిబోధము సల్పుటకు యాజకులకే హక్కు కలదు గాని, యీ యే సెవ్వరు? నారు వచ్చి యేసుతోఁ 'దత్త్వప్రబోధము సల్పుటకు నీ కధికార మెవ రిచ్చిర'ని ప్రశ్నించిరి. ఏసు వారితో, "యోహానునకు

బాప్తిస్మము ననుగ్రహించుట కెవ్వ రధికార మొసగినా ర'' ని యెదురు ప్రశ్న వేసెను. అది గడ్డు ప్రశ్న. యోహానున కా యధి కారమే లేదని చెప్పిన ప్రజలు యాజకులపైఁ దిరుగఁబడుదురు. కావున వారు "మాకుఁ దెలియద''ని చెప్పుకొనఁజూచిరి. "అయిన నా యధికారము మీకుఁ దెలియదు. తెలియఁజెప్పిన నవ్వుదురు. కావున మీకుఁ జెప్పుట నిరర్థక ము'' ని, యేసు వివరించెను. యా జకు లపుడే యేసును బట్టి, మతద్రోహిగ రాజున కప్పగింప వలయునని తలపోసిరి. కాని, వారు ప్రజలకు వెరచి, తగిన సమ యమునకై వేచియుండుటకు నిశ్చయించుకొనిరి.

అప్పటినుండి యేసు క్రీస్తు బహిరంగముగఁ దిరుగక నాం తరంగిక శిష్యకోటికి మాత్రమే యుపదేశములు సలుపుచుం డెను. ఇంతలో పస్కాపండుగ సమీపించెను. యెరూషలేమున కేసు వచ్చును. అప్పుడతని చేకాంతస్థలమునఁ బట్టుకొనఁ వచ్చు నని, యాజకులు తలపోసి వేచియుండిరి.

పస్కాపండుగకు జనులందఱు యెరూషలేమును జేరసా గిరి. పగలు ప్రార్థనాలయమున యేసు ప్రజల కుపదేశములు సల్పుచుండెను. ప్రజలు శిష్యులు యేసుక్రీస్తునకు జయ జయ ధ్వానములు సలుప సాగిరి. యాజకుల గూఢచారులు కొందఱు వినయమును నటించుచు యేసు దరిచేరి, "న్యాయమును బోధిం చుచున్న ప్రవక్తవు. పక్షపాతము లేక దేవుని మార్గమును జూపుచున్నావు. కైసరుకు మనము పన్ను చెల్లించుట ధర్మమా? కాదా? నీయుద్దేశ మే మ''ని యడిగిరి. ఈ ప్రశ్నతో యేసు వలలోఁ జిక్కు నని వారి యూహ. కైసరునకుఁ బన్ను

చెల్లింపు మనినచో నిరంకుశప్రభుత్వమున కాతఁడు దాసోహ మనినట్లే గదా! పన్ను చెల్లింప వద్దనిన, నది రాజద్రోహము. చక్రవర్తి ప్రతినిధి యైన పొంతిపిలాతు ధిక్కారమును సైచునా? ఏసే విధముగ సమాధానము చెప్పినను, బృచ్ఛకులకు సంతోషమే! కాని, యేసు క్రీస్తు వారను కొనినట్లు వలలోఁ బడలేదు. 'ఏది, మీ నాణెములను, వానిపై ముద్రను జూపింపుడ'ని కోరెను. వారు కైసరు ముద్రగల నాణెము చూపిరి. అయిన వారు కైసరు ప్రభుత్వములో నున్నట్లే గదా. "కైసరునకు జెందు వానిని గైసరున కొసంగుడు. దేవునకుఁ జెంద వలసిన వానిని దేవునకు సమర్పింపుడు!" ఇది యేసు సమాధానము. పృచ్ఛకులు తెల్లబోయిరి. యాజకుల దంభాచారము నేసు బహిరంగముగ నధిక్షేపించెను. 'నిలువు టంగీలు ధరించుకొని తిరుగాడుచు, సంత వీధులలో వందనములు, సమాజమందిరములలో నగ్రపీఠములు కోరుకొనువారు, పరలోకమున శిక్ష ననుభవించెదరు. అనాథల గృహనాశనమునకుఁ గారణ మగుచున్న వేషధారుల మాయ ప్రార్థనలు నిరర్థకములు."

ప్రధాన యాజకుని యింటిలో యాజకులు మున్నగువారి రహస్యసమావేశము జరిగినది. వారేసునకు మరణదండన విధించునట్లు చూచుటకొక కుట్ర పన్నిరి. ఏసు ద్వాదశశిష్యప్రముఖులలో నొకఁ డగు యూదా లంచము తీసికొని గురువగు నేసు నప్పగించుట కంగీకరించెను. పైశాచిక ప్రవృత్తి యావహించిన యతఁడు గూడఁ బ్రత్యక్షముగ నేసు నప్పగించుటకుఁ

బూనుకొన లేదు. పట్టపగలు, ప్రజాసమక్షమున నేసును పట్టు కొనుట సాహసమని కత్రదారు లెంచిరి. ఏకాంతస్థలమున నున్న యేసును యూదా భక్తి నటించుచు ముద్దుగొనును. కత్ర దారులు గుర్తించి యతనిబంధింప వచ్చును. ఇది వారి పన్నుగడ.

పగలు ప్రార్థనాలయమున నుపన్యసించి సాయంకాల మున నేసుక్రీస్తు, ద్వాదశ శిష్యులతో నిష్క్రమించెడి వాడు. ఏసు క్రీస్తు, సహపంక్తిలోఁ గూర్చొనిన ద్వాదశ శిష్యప్రము ఖులకు రొట్టె విరిచి పంచియిచ్చెను. ద్రాక్షారసపాత్రిక నెత్తి దేవునకు ధన్యవాదము లర్పించి, శిష్యుల కందిచ్చెను. 'ఈ రొట్టెయే నా శరీరము. ఈ ద్రాక్షారసమే నా రక్తము. మీకొఱకు నా సర్వస్వ మర్పించు చున్నాను. కాని నన్ను పడ నాడు హస్త మిచ్చుటనే యున్నది. భగవత్సంకల్ప మీవిధముఁ గలదు. దివ్యరాజ్యము భూమిలో నవతరింప నున్నది.' శిష్యుల కా వాక్యములు దుర్భరము లయ్యెను. పేతురు, 'ప్రభూ! నీతోఁ గలసి చెఱసాలకుఁ గాని మృత్యుముఖమునకుఁ గాని తరలి వచ్చెద'నని పలికెను. ఏసుక్రీస్తు మందహాసభాసురనయనము లతో "నీవు నన్నెరుగ నని ముమ్మారు పలికినఁ గాని నేఁడు కోడి కూయద"ని పలికెను.

రాత్రి యథాప్రకారము శిష్యులతోఁ గలసి యేసు క్రీస్తు ఆలీవు తోఫులో విశ్రమించుట కేగెను. ఆ రాత్రి యేసు ధ్యాననిమగ్నుఁడై యుండెను. "తండ్రీ ! నా యిష్టము కాదు. నీ యిచ్ఛయే సిద్ధించుఁగాక" ఇది యేసు క్రీస్తు తుది ప్రార్థనము.

అతఁడు ప్రార్థనను ముగించుకొని నిద్రించుచున్న శిష్యుల లేపి భగవత్ప్రార్థన సల్పుడని కోరెను. అప్పటికే జనులు గుమిగూడి యుండిరి. యూదా ముందునకు వచ్చి కుహనాభక్తితో నేసు క్రీస్తును ముద్దుగొనెను. 'యూదా! దొంగ ముద్దుతో నన్నప్ప గించుచున్నావా?'యని యేసు సూటిగఁ బ్రశ్నించెను. నాటి నుండి యూదాముద్దు మాట కుహనాభక్తికిఁ బర్యాయపదముగఁ జగతిలో నాటుకొనినది. ఏసు తన్ను బంధింప వచ్చిన, యాజకులతోఁ, బీఠాధిపతులతో, "బందిపోటు దొంగను బట్టుటకు వచ్చినట్లు కత్తులు గుదియ లేల? నేను నిత్యము ప్రార్థనాలయమునకు వచ్చుట లేదా?" యని యడిగెను. ఏసు వచనములను లెక్క చేయక వారతని నీడ్చుకొని ప్రధాన యాజకుని గృహమునకుఁ దీసికొని పోయిరి. పేతు రా జనములోఁ గలసి వెంట నేగెను. చలికాగుటకు వ్రేల్చిన మంట వెలుఁగున నొక చిన్నది పేతురును జూచి, "యితఁడు కూడ నేసుతో నున్న వాఁడే" యని చాటెను. పేతురు భయపడి, "నే నతని నెరుగన"ని బదులు పల్కెను. మఱికొంతసేపటికి, వేరొకఁ డతనిఁ దేరిపారఁజూచి "యితఁడేసు వర్గము లోని వాఁడే" యని యనుమానించెను. పేతురు వెంటనే "యయ్యో! నే నాతని వర్గము లోనివాఁడను గాన"ని సమాధానము చెప్పుకొనెను. ఒకగడియ గడచిన పిమ్మట, మఱియొకఁ డాతనిఁ జూచి, "యితఁడు గలిలీయుఁడే. ఏసుతో నుండెడివాఁడ"ని గుర్తు పట్టెను. పేతు రతని మాట ఖండించి యేసుగూర్చి తన కేమియుఁ దెలియ దనెను. అంతఁ గోడి కూసెను. పేతురునకు గురువాక్యము

స్మరణకు వచ్చెను. అతఁడు బయటకుఁ బోయి తీవ్రవేదనతో విలపింప సాగెను.

ఏసును బట్టుకొనిన మనుష్యు లాతని నపహసించిరి. అవమానించి, యతని ముఖమును గప్పి, నెత్తిపై మోది కొట్టినవాఁ డెవ్వఁడో చెప్పుకొను మని గేలి సేయ సాగిరి.

ఉదయమున యాజకులు ప్రజలు పెద్దలు సభకూడిరి. ఆ మహాసభలో నభియోగి యేసు నిలచెను. "నీవు దేవుని కుమారుఁడవా? అవతరించిన క్రీస్తువా?" ఇవి ప్రశ్నలు. "నే నేమి చెప్పినను మీరు నమ్మరు. మీ రనుకొనినట్లే కానిండు" ఇది యేసు సమాధానము. సభలో యేసు దోషము నంగీకరించి నట్లే భావించఁబడెను. ఇఁక సాక్షు లేల? వా రతని పొంతిపిలాతు దగ్గరకుఁ దీసికొనిపోయిరి. అక్కడ యేసుపై మోపఁబడిన నేరములు వేరు. "ఇతఁడు ప్రజలను దిరుగఁబడుటకుఁ బురికొల్పుచున్నాఁడు. ఇతఁడే యూదులకుఁ గ్రొత్తగా నవతరించిన ప్రభువట!" చివరి మాట పిలాతునకు గ్రుచ్చుకొనినది. "నీవు యూదుల ప్రభువవా?" యని యేసును బిలాతు ప్రశ్నించెను. "మీరే చెప్పుచున్నారు గదా!" ఇది యేసు నొద్దనుండి వచ్చిన సమాధానము. పిలాతు యాజకులతో గుమిగూడిన ప్రజలతో, యేసునందు వా రారోపించిన నేరములు గోచరించుట లేదని పల్కెను. ప్రజలందఱు నాతఁడు గలిలియనుండి యెరూషలేము వరకుఁ గల జనులను మత దేశ విద్రోహులుగ మార్చుచున్నాఁడని ఘోషించిరి. ఏసు గలిలీయుఁ డని తెలిసికొని పిలాతు యెరూషలేము

నకు వచ్చియున్న హేరోదు దగ్గర కాతనిఁ బంపెను. హేరో దంతకుముందే యేసునుగూర్చి విని యాతనిఁజూడఁ గోరు చుండెను. ఇప్పు డతనిఁ గాంచఁ గల్గి నందుకు సంతోషించి, యతఁడే మైన యద్భుతకృత్యముల సల్పు నేమో చూచి వినోదింపఁ దలఁపోసెను. కాని యేసు ప్రశాంతగంభీరమూర్తియై నిలిచెను. యాజకులు మున్నగు వారతని దూషించిరి. హేరోదు పలుకరించెను. అపహసించెను. తుద కతనికి మేలి వస్త్రములు గట్టిబెట్టి పిలాతు నొద్దకుఁ దిరిగి పంపించెను. పిలాతు ప్రధానయాజకులను, పెద్దలను రావించి "మీరితనిపై మోపిన నేరములలో నొకటియైన ఋజువు కాలేదు. హేరోదుకూడ నితనిఁ దిరిగి పంపివైచెను. ఇతని శిక్షించి వదలివేసెద" నని చెప్పెను. వారేసును సిలువ వేయవలెనని పట్టుపట్టిరి. మరణదండన యా కాలమున సిలువ వేయుట. నిర్దోషిని ప్రజాదురహంకారమునకు బలి యొసగుటకుఁ బిలాతు నంతరాత్మ సమ్మతింప లేదు. అతని వైముఖ్యమును గాంచి, "యితఁడు కైసరు చక్రవర్తిని ధిక్కరించి తానే రాజునని చాటుకొనుచున్నాఁడు. చక్రవర్తి శత్రువులు మీకు మిత్రులా?" యని యాజకులు పిలాతు నడిగిరి. వారి బెదరింపులకు పిలాతు లొంగిపోయెను. పస్కాకు దోషులలో నొకని విముక్తుఁ జేయుట యాచారము. "నరహత్య సల్పిన బరబ్బను విడిచిపెట్టనా? యేసును వదలిపెట్టనా?" యేసునకు మరణశిక్ష తప్పించుటకై పిలాతు సల్పిన తుదియత్నమా ప్రశ్న. అచ్చటఁ జేరినవా రేకగ్రీవముగ, బరబ్బను వదలి, యేసును సిలువ వేయవలెనని ఘోషించిరి.

పిలాతు తప్పే కానిమ్మని బరబ్బను బంధవిముక్తుని గావించి యేసును 'మీ యిష్టము వచ్చినట్లు చేయుడ'ని వారి కప్పగించెను.

సైనికులు, యాజకులు, పెద్దలు వెంట వచ్చుచుండ యేసును సిలువ వేయుటకై దీసికొని పోసాగిరి. ఆనాటి నియమము లంబట్టి సిలువను దండితుడే మోయ వలసి యుండెను. యేసుతో బాటు సిలువ వేయుటకు మఱి యిద్దరు బందిపోటుదొంగలం గూడ దీసికొని పోసాగిరి. సీమోను అను కురేనీయుడు వారికెదురుపడెను. సైనికులు వానిచే బలవంతముగా యేసు సిలువను కపాలమను స్థలమునకు మోయించిరి. అది సిలువ వేయు చోటు. జన సమూహమున స్త్రీలు యేసుకై దుఃఖింప సాగిరి. యేసు తనకై వారు దుఃఖింప నవసరము లేదని, తమ సంతానము నకై మాత్రమే విచారింప వలసి యున్నదని హెచ్చరించెను. సైనికులు "నీవు యూదుల ప్రభు వైన, దేవుని కుమారుడ వైన, నిన్ను నీవే రక్షించుకొనుము. చూచెదమ"ని గద్దించి యపహసించ సాగిరి. సిలువపై "యూదుల ప్రభువు" అని ఎగతాళిగ వ్రాసిరి. అతని శిరస్సుపై ముండ్ల కిరీటము నుంచిరి. చేతులలో గాళ్లలో నినుప గసిగలు గ్రుచ్చి యేసుక్రీస్తు ప్రభువును సిలువపై వ్రేలాడ దీసి, సైనికు లాతని వస్త్రములు చీట్లు వేసి పంచుకొనిరి. అధికారు లితడే దేవుని క్రీస్తయినచో, నితరులను రక్షించినట్లు గాక తన్ను దానే రక్షించుకొను నని యుపహసించిరి. సైనికులు తుచ్ఛ నిరసన భావముతో యేసుపై నుమ్మివైచిరి. యేసు క్రీస్తున కిరువైపులను

బందిపోటు దొంగలను సిలువవేసిరి. సైనికుల దృష్టిలో నా పాపులకు యేసునకును భేదము లేదు. ఆ దొంగలలో నొకడు యేసును సరసభావముతోఁ జూచి "నీవే యీశ్వర ప్రేరిత ప్రవక్తవైన, నేల నిన్ను రక్షించుకొని మమ్ముఁ గూడ రక్షింప లేకున్నావ"ని యడిగెను. రెండవ దొంగ "మనము నేరము చేసి మరణదండనఁ బొందినాము. ఈమహానుభావుఁడు నిర్దోషి. ఈ సాధుశీలుని లోకోత్తర త్యాగమునకు మనకంటెఁ బ్రత్యక్ష సాక్షు లెవ ర"ని మొదటివానిని వారించెను. వారి నీశ్వరుఁ డనుగ్రహింపఁ గలఁడని యేసు కృపాంతరంగుఁడై యభయ మొసగెను.

మహానుభావుఁ డేసు క్రీస్తు పెదవి విరుపక ధ్యాన నిమగ్నుఁడై పాపులమధ్య సిలువ వేయఁబడి యంతయు సహించి యుండెను. ఆ యతిలోకదయాసహనము దివ్యము. ద్వాదశ శిష్య ప్రముఖులలో నొకఁడు కుటిలోఁ జేరి గురువు నప్పగించెను. యాజకులు పెద్దలు మత్సరగ్రస్తులై మారణ దండనకై కుట్ర పన్నిరి. శిష్యులు గూడ ధైర్యము లేక వీడి పోయిరి. ఒక చెంప పైఁ గొట్టిన, సిరోధింపక వేఱొక చెంప చూపు మని ప్రబోధించిన నిర్దోషిని, సాధుశీలుని, ప్రభువు పిలాతు సిలువ వేయు నాజ్ఞ యిచ్చి, దుర్వివేకమున దుష్టుల కుతంత్రములకుఁ గీలుబొమ్మ యయ్యెను. మానుష దైవకృషు లన్నియు యేసు క్రీస్తుపైఁ గుటిలి పన్ని నట్లుండెను. అట్టి ఘోరవిషాదవిపత్సమయమున, నిశ్చలశాంతి గంభీరమూర్తి యేసు క్రీస్తు, "తండ్రీ! వీ రేమి చేయు చున్నారో వీరికే తెలియదు! వారిని క్షమించి రక్షింపు" మని క్షమాతరంగితమైన కృపానిస్వనములతో దేవునిఁ బ్రార్థించెను.

సిలువపై నేసుక్రీస్తు భగవద్ధ్యానము సలుప సాగెను. ఏసు తల్లి మరియ మఱికొందరు స్త్రీలు, శిష్యులు దూరమునుండి విషాదపరవశులై యా సన్నివేశమును జూడ లేక దుఃఖించుచుండిరి. పిపాసాకులుఁడైన యేసున కొకఁడు పానపాత్రిక నందింపఁ బోయెను. కాని, మఱియొకఁడతని వారించి, యేసు దేవుని కుమారుఁడైన నాతఁడే సిలువ దిగి పానపాత్రిక నందుకొను నని యాక్షేపించెను.

విశ్వవేదనకు శ్రుతి గల్పుకొని కొట్టుకొను చున్న యేసుక్రీస్తు గుండెలో దుర్భరవేదన పరిపక్వత సిద్ధించినది. మహానుభావుఁ డేసు క్రీస్తు "తండ్రీ! నా యాత్మను నీ చేతి కప్పగించుచున్నాన"ని కేకవేసి తల వాల్చెను.

సిలువ ప్రపంచచరిత్రలో జగద్ధితాకాంక్షులకుఁ బరమ పవిత్రచిహ్నమై శాంతిధ్వజమై వెలసినది.

ఆ మధ్యాహ్నసమయమున నకస్మాత్తుగ మబ్బులు గ్రమ్ముకొని, యుఱుములతోఁ జీకటి వ్యాపించెను. ప్రార్థనాలయము నందలి నేపథ్యము నిష్కారణముగఁ జినిగి పోయెను. ఈ యుత్పాతములఁ గాంచి, విజ్ఞు లేసు దేవుని కుమారుఁడైన దివ్యప్రవక్త యని తలపోయ సాగిరి. అరిమతయియ గ్రామవాస్తవ్యుఁడైన యోసేఫు భగవద్భక్తుఁడు. ఏసు క్రీస్తు శిష్యుఁడు. అతఁడు పిలాతునొద్దకు రహస్యముగా నరిగి యేసు దేహమును దీసికొని,సమాధి సల్పుట కనుజ్ఞఁ బడసెను. అతఁ డేసు దేహమును దీసికొని, సన్నని నారబట్ట చుట్టి, సమీపారామములోని దొలిచిన రాతి తొట్టిలో నుంచెను.

విశ్రాంతిదినమునఁ బ్రాతఃకాలమున యేసు శిష్యులు పరిమళద్రవ్యములతో సమాధిస్థలమును జేరిరి. కాని యచ్చట యేసు మృతదేహమును గానక యాశ్చర్యపరవశులైరి. మరియు, మగ్దలీను మున్నగు స్త్రీ శిష్యులు యేసు వాక్యముల స్మరింప సాగిరి. ఏసు క్రీస్తు సమాధినుండి పునరుజ్జీవితుఁడై సాక్షాత్కరించి నట్లు శిష్యులు శిష్యురాండ్రు ప్రత్యక్షసాక్ష్యము నొసగిరి.

ఏసుక్రీస్తు భగవద్వరప్రసాదమున కన్యక మరియ కుద్భవించుట, మృతసమాధినుండి యతని పునరుత్థానము క్రైస్తవ మతమునకుఁ బ్రాతిపదికలై వెలసినవి. ఏసు క్రీస్తు ప్రభువు పునరుత్థానానంతరము శిష్యుల సంభావించి, వారి యెదుటనే స్వర్గారోహణము సల్పెనని యపోస్తలుల ప్రత్యక్షసాక్ష్యము. ఎంత త్యాగమున కైన నోర్చి, సమకాలీనులైన యేసు క్రీస్తు శిష్యులు ప్రేమ విశ్వాసము నకుంఠితదీక్షతో సత్యస్ఫూర్తితో నిత్యప్రచారము సలిపిరి. చరిత్రలో యేసు క్రీస్తు పవిత్ర ప్రబోధముల నాదలఁదాల్చు క్రైస్తవమత సమాజము ప్రపంచమందెల్లెడ నలముకొనెను.

మహానుభావుఁడైన యేసు క్రీస్తు యొక్క యాత్మబలిదానము వలన భగవద్భక్తికి, దీనసేవకు దయార్ద్రతకు ఖండ ఖండాంతరములలో, యుగ యుగాంతరములలో మానవహృదయములలోఁ బ్రార్థనాలయములు వెలసినవి; వెలయుచున్నవి; వెలయఁగలవు.

# గాంధి

గాంధిమహాత్ముని శైశవనామధేయము మోహనదాసు కరంచందు గాంధి. అసలు పేరు మోహనదాసు. కరంచందు తండ్రిపేరు. గాంధి వంశనామము. తల్లి పుత్లీ బాయి. గాంధి జన్మస్థలము పోరు బందరు. క్రీస్తుశకము 1869 సంవత్సర మక్టోబరు నెల రెండవ తేదీ జన్మదినము. పోరుబందరు కాథియావాడులో నొక చిన్ని సంస్థానము. గాంధి వంశమువా రాసంస్థానమున ప్రధానమంత్రులు. గాంధి తాతగారు పోరుబందరు సంస్థానమున దివానుగిరి వదలిపెట్టి జునాగడ్ సంస్థానమున నుద్యోగమునకుఁ గుదురుకొన వలసివచ్చెను. అప్పుడు గాంధి తాతగారు జునాగడ్ నవాబునకు వామహస్తముతో నభివాదము సల్పెను. ఈ విషయమునకుఁ గారణ మడుగగా నతఁడు "కుడి చేయి యీ వఱకే పోరుబందరునకు సమర్పణమైనద"ని సమాధానము చెప్పి తన ఋజుశీలమున కభినందనముల వడసెను.

కరంచందు గాంధి రాజకోట సంస్థానమున దివాను పదవి నధిష్ఠించెను. పుత్లీబాయి యతని నాలుగవ భార్య. గాంధి యాదంపతుల కడగొట్టు బిడ్డఁడు. గాంధి తల్లి పుత్లీబాయి భక్తురాలు. ఉపవాసములు వ్రతములు, చాంద్రాయణ చాతుర్మాస్యాదీక్షలు నామె దినచర్యలు. గాంధి శైశవము పోరుబందరులో గడచెను. ఉన్నత పాఠశాలలో గాంధి మాతృభాష యైన గుజరాతీతోఁ బాటు కొంత సంస్కృతమును గూడ నభ్య

సించెను. చదువుకొను రోజులలో నతనికి తెలివి గలవాఁడని పెద్ద పేరు లేదు. కాని గురువులయందు భక్తితోఁ జదువునందు శ్రద్ధతో నుండెడివాడు.

ఒకసారి గాంధి హరిశ్చంద్ర నాటకము చూచెను. హరిశ్చంద్రుని యకుంఠితసత్యదీక్ష కోమలమనస్కుఁడైన గాంధి హృదయమున హత్తుకొని పోయినది. అతఁడు సత్యవ్రతమును గూర్చి కలలు గనసాగెను. గాంధి యున్నతపాఠశాలలో నుండగనే చదువుచుండగనే కస్తూరిబాయి యను కన్యక నిచ్చి వివాహము సల్పిరి. ఆ యేడు గాంధి విద్యకు విఘాత మేర్పడినది.

ఉన్నత పాఠశాలలో నుండగనే గాంధి సహవాస దోషమున ధూమపానమును, మాంసభోజనము రహస్యముగ నారంభించెను. కాని యా నాఁడు గాంధికి నిదుర పట్టలేదు. ఏవో పీడ కలలు. పొట్టలో బ్రదికిన మేక "మే మే" యని దీనముగ నరువ సాగినట్లయ్యెను. కాని, యెట్లో ధైర్యము తెచ్చుకొనెను. మాంసభోజనము వల్లనే తెల్లవారి కా ప్రతాప మనియు, భారతదేశ దాస్యమున కిట్టి మానసికదౌర్బల్యమే కారణ మని మిత్రుఁ డిది వఱకే వాదించి యుండెను. ఆ మాంసభోజనార్థము చివరకు గాంధి యప్పులలో మునిగి దొంగతనమునకుఁ బాల్పడవలసి వచ్చెను. అన్నగారితోఁ గలసి యతని మురుగులో ముక్క తెగఁగొట్టి, యమ్మివేసి యప్పులు దీర్చెను. కాని—మిక్కిలి ప్రేమతో సల్లాపు ముద్దుగఁ బెంచుచున్న తల్లిదండ్రులకు వారి

దుష్ప్రవర్తన తెలిసినచో! గాంధి గుండెలు ఝల్లు మనెను. ఆత్మదోష మాతని పశ్చాత్తాపములో ముంచినది. కాని తండ్రితోఁ దన యపరాధము ప్రత్యక్షముగాఁ జెప్పుకొను ధైర్య మతనికి లేదు. కావున, నతఁ డొక చీటిపైఁ జేసిన తప్పు నంతను వ్రాసి, తానే తీసికొనిపోయి తండ్రి కిచ్చెను. అందు గాంధి తప్పు నకు శిక్షను గోరుకొనుటయే గాక పశ్చాత్తాపమును వెలిపుచ్చి యింక మీఁద నట్టి తప్పు చేయ నని శపథముచేసెను. ఆ చీటి నిచ్చి గాంధి గజగజ వణకుచు నిల్చెను. తండ్రి యా చీటిని చదివి కన్నీరు నించెను. పితృప్రేమబాష్పములు గాంధి హృదయమాలి న్యమును గడగివైచెను. ఇట్టి యాత్మపరిశోధనమే మొదటి నుండి గాంధిశీలమునకు మెరుగులు దిద్దినది.

గాంధి పదునారవ యేట తండ్రి మరణించెను. ఉన్నత పాఠశాలావిద్య ముగించుకొనిన తర్వాత నతఁడు భావనగర శ్యామలదాసు కళాశాలలోఁ జేరెను. కాని భారతదేశమునఁ గష్టపడి కళాశాలలోఁ జదువుటకంటె సింగ్లండులో మూఁడేం డ్లుండి బారిష్టరు పట్టమును బొందుట సుకరమే గాక జీవిత ములో విజయమునకు నడ్డదారి. "మావుజీదవే" గాంధి కుటుంబ హితాభిలాషి యా సలహా నిచ్చెను. గాంధి యన్న గారు గందుల కియ్యకొనెను. తల్లిమనస్సులో సంకోచ ముండెను. సీమలో మద్య మాంసముల యలవాటు తప్పనిసరియగు నని యామె వినికిడి. గాంధి తల్లిదగ్గర మద్యమాంస మహిళా సంపర్కము నకుఁ బోనని శపథము సలిపెను.

గాంధి యింగ్లండులో బారిష్టరు పట్టమునకుఁ జదువ నారంభించెను. అప్పటి కతఁడాంగ్లమును ధారాళముగా మాటలాడఁ జాలకుండెను. అతనికిస్వభావసిద్ధముగా బిడియ మెక్కువ. వెళ్లినది క్రొత్త దేశము. పైగా శాకాహారదీక్ష. సీమలో గాంధి జీవిత మసిధారావ్రతముగ గడచెను. అతఁ డచ్చట శాకాహార సమాజమునఁ జేరెను. గాంధి శాకాహారదీక్ష కప్పుడు మాతృదేవి కడఁ గైకొనిన శపథమే కారణము. కాని మననశీలి యైన యతఁడు మానవాహారమునుగూర్చి యోజింప సాగెను. అతఁ డనేక మిత్రులతోఁ జర్చించెను. తుదకు సాల్టు వ్రాసిన శాకాహారవాద మను గ్రంథము చదివి తన వ్రతమును దీక్షతో మాత్రమే గాక విశ్వాసముతో నాచరింప సాగెను. గాంధి సీమ వేషభాషల నలవరచుకొనెను. యూరోపులో లాటిను పాండిత్య భాష. ఫ్రెంచి నాగరికభాష. గాంధి యా భాషల నభ్యసించెను. వాయులీనము, నృత్యము నభ్యసించి యాంగ్లసభ్యత నలవరచుకొనఁ జూచెను. కాని, కొంతకాలమునకే యా ప్రియత్నము నిరర్థకమని విశ్వసించి విరమించెను. గాంధి పదివందిలో నున్నపుడు నోరు విప్పుట కేజంకుచుండెడివాఁడు. చివరకు శాకాహార సమాజసభలో నుపన్యసించుటకు గుండె దిటము చేసికొని నిలిచెను. కాని యతని నోటివెంట మాట రాక పోవుటయే గాక, యూపి రాడ లేదు. సదస్యులకు ధన్యవాదము లర్పించి, గాంధి వేదికను దిగిపోయెను. సీమలోనే గాంధి యునిబిసెంటు సతితోఁ బరిచయ మొందెను. దివ్యజ్ఞానసమాజమువలన గాంధికిఁ బ్రాచీన భారతసంస్కృతిపై, భగవద్గీతపై మిక్కిలి పూజ్యభావ

మేర్పడెను. క్రైస్తవమతగ్రంథముల నాతఁడప్పుడు చదువ
నారంభించెను. ఏసు క్రీస్తు గిరిశిఖరప్రబోధము గాంధి హృద
యమున హత్తుకొనెను. "దౌష్ట్యమును నిరోధింపక యపకార
మునకుఁ బ్రత్యుపకారము సలుపవలెను. ఎవఁడేని నీ కుడిచెంప
మీఁద లెంపకాయ కొట్టినచో, నీ యెడమ చెంపకూడ వాని కొ
గ్గుము. ఎవఁడేని నీయుత్తరీయమును లాగికొనినచో, నీ యంతరీ
యముఁ గూడ నిచ్చివేయుము." ఈ బోధను గాంధి మహోదార
నీతిగ, మహోపయుక్తోపదేశముగ నెంచెను.

గాంధి భారతదేశమునకు బారిస్టరై క్రీస్తుశకము 1891వ
సంవత్సరమునఁ దిరిగి వచ్చెను. కాని,—మాతృదేశమునకు వచ్చు
టతోడనే గాంధి మాతృమరణము నెఱిగి, లోలోనఁ గుమిలి
పోయెను. జనయిత్రి మరణము నతనికి సీమలో నున్నప్పుడు తెలి
యనివ్వ లేదు. బొంబాయిలో గాంధి బారిస్టరుగ వృత్తి నారం
భించెను. కాని, యచటి కుతంత్రములు, నైచ్యవాతావరణము
గాంధికి నచ్చ లేదు. అనుభవము లేని సరిక్రొత్త బారిస్టరు. ఎవరు
కేసులు నిత్తురు? అదియును గాక, కేసులు తెచ్చుకొనుటకు దళా
రు లుందురు. ఈ దళారులకు రుసుము చెల్లించుట యవినీతి యని
గాంధి వారిని నిరాకరించెను. కడకొక కేసు వచ్చినది. వాదింప
వలసిన సమయమున న్యాయమూర్తి యెదుట గాంధి పెదవి కదల
లేదు. ప్రపంచ మంతయుఁ దిరుగాడఁ జొచ్చినది. గాంధి తీసికొన్న
'ఫీజు' పైకము నిచ్చివేసి యా కేసునుండి విరమించుకొనెను. ఇంక
బొంబాయి వాసము లాభము లేదని గాంధి రాజకోటను జేరి
యక్కడ బారిష్టరు బల్ల కట్టెను. అచ్చట నతనియన్నగారు, నన్న

గారితో నమ్మడిగాఁ బని చేయు చున్న నురియొక న్యాయవాది సాహాయ్యమున నెట్లో విన్నపములు వ్రాసి, చిన్న కేసులను జూచి జీవితమును నెట్టసాగెను.

పోరు బందరులోని మేమన్ దుకాణము వారికి దక్షిణ-ఆఫ్రికాలో వ్యాపారముకలదు. వారు 40,000 పౌనుల దావాలోఁ జిక్కుకొనిరి. "దాదా అబ్దుల్లా అండ్ కో" వారికి చెందిన యీ దావాలో మిగిలిన పెద్ద వకీళ్లతోఁగలసి పనిచేయుటకు గాంధినిఁ బంప మని వారు గాంధి యన్న గారినిఁ గోరిరి. ఈ యవకాశ మునకు మిక్కిలి సంతోషించి గాంధి దక్షిణ-ఆఫ్రికాకుఁ బయ నించెను.

నేటాలు రేవు పట్టణ మైన దర్బానులో గాంధి దిగెను. అబ్దుల్లా సేటుగారు రేవునకు వచ్చి గాంధి నింటికిఁ దీసికొని పోయెను. గాంధి యబ్దుల్లాసేటున కతని తమ్ముఁ డొసగిన పరిచయలేఖ నొసంగెను. గాంధి యాంగ్ల వేషము, వాగ్ధోరణి గాంచి యాతఁడు తన తమ్ముఁ డొక వెల్ల యేనుగును దనకడ కంపెనని తలచెను. రేవునకు వచ్చిన తెల్లవార లబ్దుల్లాసేటును దేలికగాఁ జూచుచుండుట గాంధికి మిక్కిలి యాశ్చర్యము గొలిపెను. కాని యబ్దుల్లాసేటు, దానికి యేనాఁడో యలవాటైపోయెను.

రెండవ నాఁడో మూఁడవ నాఁడో యబ్దుల్లాసేటుతోఁ గలసి గాంధి దర్బాను కోర్టున కేగెను. అచటఁ దలపాగతోఁ గూర్చొనిన గాంధి వైపు మొదటినుండి న్యాయాధికారి మిఱ్ఱి మిఱ్ఱి చూడ సాగెను. చివర కాతఁడు గాంధిని తలపాగఁ దీసివేయ నాజ్ఞ

పించెను. గాంధి తలపాగ దీసివేయుటకు సమ్మతింపక కోర్టు నుండి నిష్క్రమించెను.

తలపాగ నేల తీయావలెను? ఈ యాజ్ఞలోని యాంతర్యము గాంధికి మెల మెలగా స్వయంవ్యక్తమయ్యెను. దక్షిణ-ఆఫ్రికా లోని భారతీయులలో నధికసంఖ్యాకులు కూలీలు. వీరు భారత దేశమునుండి యైదేండ్లు నేటాలునఁ గూలి పని చేయుటకు గుత్తకొనఁబడినవారు. వీరికి గిర్మిటియా లని పేరు. ఐదేండ్ల యొడంబడిక కాంగ్లపద మగు "అగ్రిమెంటు"న కపభ్రంశము గిర్మిట్. అందుండి గిర్మిటియా పద ముద్భవించెను. అందుచే భారతీయు లందరు కూలీ లనియే పిలువఁ బడుచుండిరి. వర్తకు లైన భారతీయులు కూలీ వర్తకులు. గాంధి యట్లే కూలీ బారిష్టరని పేరుకెక్కెను. దక్షిణ-ఆఫ్రికాలో నాదిమనివాసులు జులు జాతి వారు. తెల్లవారాఖండమును బ్రవేశించి నప్పుడు వారు మిక్కిలి యనాగరికులు. ఈ మధ్య నొక జులు నాయకుని యభిభాషణము మిక్కిలి యర్థవంత మైనది. "తొలుత క్రైస్తవమత పరిచారకులై తెల్లవారు దక్షిణ-ఆఫ్రికా చేరిరి. అప్పుడు వారి చేతులలో బైబి లుండెడిది. మా చేతులలో సమస్త భూమి యుండెడిది. ఇపుడు మా చేతులలో బైబి లున్నది. వారి చేతులలో సమస్త భూమి యున్నది." తెల్లవారు దక్షిణ-ఆఫ్రికా క్షేత్రికులైరి. సారవంత మైన భూములను సాగుబడిలోనికి దేవలయు నన్న శ్రామికులు కావలెను. దొరలా పనికిఁ బూనుకొనరు. జులుల కది యగమ్యము. కావున, చవుకగా భారతదేశము నుండి గిర్మిటియాలను దిగుమతి చేసికొని, వారి కాయ కష్ట

ముచేఁ దెల్లవారు దక్షిణ-ఆఫ్రికాను సస్యశ్యామల మొనర్చు కొనిరి. కాని చెమట నోడ్చి, తెల్ల దొరల కోసము దేశము నంతను సుభిక్ష మొనరించిన భారతీయుల యునికి, తమపని నెరవేరిన తర్వాత దొరలకు గిట్టుట లేదు. కూలి వారు యజమానుల యెడ వినయ భయభక్తులు ప్రదర్శింప వలెను. తెల్లదొరల సమక్ష మున భారతీయు లెవ్వరు టోపిగాఁ దలపాగతో నుండరాదు. విన యముగాఁ దలపాగ దీసివేయ వలెను. కొందఱు ముస్లిములీయ వమానమును దప్పించు కొనుటకు దా మరబ్బుల మని చెప్పు కొనువారు. తలపాగపైఁ బత్రికలలోఁ జర్చలు జరిగెను. గాంధి నచ్చటి పత్రికలు పిలువని పేరంటకాఁడని యవహేళన మొన ర్చినవి. కాని, దాని వలన గాంధి పేరు నలుగడలఁ దెలిసినది.

దక్షిణ-ఆఫ్రికాలో గాంధి కనులు విప్పిన ఘట్టముల నేకములు. ఒకసారి మొదటి తరగతి టిక్కెట్టు కొని రైలులోఁ బయనించు చుండెను. మార్గమధ్యమున నాతని మూడవ తర గతి పెట్టెలోని కేగు మని గార్డు, పోలీసులు నిర్బంధించిరి. “నా దగ్గర మొదటి తరగతి టిక్కెట్టు గలద”ని గాంధి దిగుటకు నిరా కరించెను. నల్ల వారితోఁ గలసి తెల్ల వారు పయనింపరు. అది పాలకులగు దొరల యుద్ధతికి లోటు. పోలీసులు రెక్క పట్టుకొని గాంధిని సామానుతోఁ గ్రింది కీడ్చి వేసిరి. రైలు కదలిపోయెను. ఆ రాత్రి గాంధి చలిలో స్టేషనులో నుండవలసివచ్చెను. పగలు తిరిగి పయనము సాగించి గమ్యమును జేరెను. అచట భారతీయు లిట్టి యవమానముల నెన్నింటిని దిగమింగిరో కథలు కథలుగాఁ జెప్ప సాగిరి. గాంధికి జ్ఞానోదయ మయ్యెను. దక్షిణ-ఆఫ్రికాలో

నాత్మగౌరవమునకు స్థానము లేదా? భారతీయు లెవ్వరికి తెలుపని మిత్రులు కచ్చితముగా సమాధాన మొసగిరి. గాంధి మనస్సు మార్గము నన్వేషింప సాగెను.

ఒకసారి చేర్లెసు పట్టణమునుండి జూహాన్సుబర్గునకు గుఱ్ఱపు బండి టికెట్టు కొనెను. తెల్లదొరలతోఁ బాటు గాంధిని బండిలోపల కూర్చుండఁ బెట్టక, యధికారి సారథిప్రక్క చోటు చేసెను. గాంధి చేయునది లేక యట్లే పయనింప సాగెను. ఆ యధికారి కొంతసేపటికి సిగరెట్టు త్రాగుటకు సరదాకు సారథి ప్రక్క గూర్చుండఁ దలచి గాంధిని దిగి తన పాదముల క్రింది బల్ల పైఁ గూర్చుండుమనెను. "అసలు నన్నిచటఁ గూర్చుండ మనుట యే తప్పు. ఇపుడు మీ పాదముల క్రిందఁ గూర్చొమ్మను చున్నారు, ఇది నా కవమానము. నేను లోపలఁ గూర్చొనెదను." ఈ మాటలు గాంధి నోట వెలువడుటయే తడవు. ఆ యధికారి గాంధి లెంపలు నెడ పెడ వాయించెను. బాటసారులు కొంద అడ్డు పడిరి. ఆ గండము గడచినది. కాలి బాటపై నల్లవారు నడువరాదు. గాంధి చాల సారులు కాలినడకనే పోవుచుండెడి వాఁడు. ఒకసారి పోలీసు చూచి గాంధిని జిఁతుకఁ దన్నెను. ఒక తెల్లదొర, గాంధి మిత్రుఁడది చూచి, యాపోలీసువానిపై కేసు పెట్టు మనెను. గాంధి యాతని మనఃపూర్వకముగ క్షమించెనే గాని, కేసు పెట్టుటకు సమ్మతింప లేదు.

హోటళ్ళలో భారతీయులు, కుక్కలు లోనికి రాఁగూడ దను ప్రకటనలు వ్రేలాడు చుండెడివి. అయిన దక్షిణ-ఆఫ్రికా శ్వేతజాతియంతయు నీ రంగు తెగులుతోఁ గ్రుళ్ళిన మురికిగుంట

మాత్రమే యని తలుపరాదు. ఆ తెల్లవారిలోఁగూడ దానధర్మ పరులు, దయాశీలురు లేక పోలేదు. వారెందఱో గాంధి నాద రించిరి. క్రైస్తవ 'మిషను' లో నున్న తెల్లవారెందఱో గాంధికి గాఢ మిత్రులు.

దాదా యబ్దుల్లా కేసు చాల కాలమునుండి జరుగు చుండెను. గాంధి యా కేసులో మిక్కిలి కష్టపడి పని చేసెను. కాని యాతని మనస్సు కోర్టు, న్యాయసూత్రములపైన లేదు. వాది ప్రతివాదుల నిద్దరఁ జేర్చి, చివరకు గాంధి వారికి రాజీ కుదిర్చెను. గాంధి పని ముగిసినది. అతఁడు స్వదేశమునకుఁ దిరిగి పో సంకల్పించెను. అబ్దుల్లా సేటు గాంధికి వీడ్కోలు విందు నేర్పాటు చేసెను.

వీడ్కోల్లు విందునకు భారతీయులు చాలమంది వచ్చిరి. ఆ నాటి పత్రిక వలన సేటూలు భారతీయులకు శాసన సభలకు సభ్యుల నెన్నుకొను 'వోటు' హక్కు తీసివేయు శాసనవిషయము గాంధి చూచెను. గాంధి యతిథుల కందఱకా విషయము నెరిగించి, "యిది భారతీయుల యాత్మగౌరవమునకు వేరు పురుగు. వారి కిది ప్రథమోచ్చాటన మంత్రి మ"ని తెలిపెను.

అతిథు లందఱు భారతీయుల హక్కులకై యాందోళన సలుప వలె నని నిశ్చయించిరి. గాంధి నాగ మని బలవంతము సల్పిరి. అబ్దుల్లా సేటు 'మన యూహ మంచిదే. గాంధి గారు బారిష్టరను మాట మరచిపోవద్దు. మరి వారి ఫీజు మాట?' యని చమత్కరించెను. కాని గాంధి మనస్సు చివుక్కు మనెను.

అతఁడు "ప్రజాసేవకు ఫీ జేల? నే నుచితముగ నే సేవ చేయఁ గల న"ని చెప్పెను.

వీడ్కోలు విందునకు వచ్చిన యతిథి బృందమే దక్షిణ-ఆఫ్రికా భారతీయ సభకు కార్య నిర్వాహక సర్గము గుట వింతలలో వింత. దక్షిణ-ఆఫ్రికాలో నాత్మసమ్మాన సంగ్రామమునకు, గాంధి జీవితమునకు, నదియే పునాది. గాంధి దక్షిణ-ఆఫ్రికాలో నాగి నా శాసనమునకుఁ బ్రతికూలముగ మహాందోళనము చెలరేగఁ దీసెను. పదివేల సంతకములతో నర్జీ యొకటి ప్రభుత్వమున కం దిచ్చిరి. కాని యా శాసనము నెగ్గినది. కాని యా యుద్యమము భారతీయులలో రాజకీయ చైతన్యమును గల్గించి యనేక స్వయంసేవకులను నాయకులను బురికొల్పినది. గాంధి భారతమిత్రుల ప్రోత్సాహమున దక్షిణ-ఆఫ్రికాలో నివాస మేర్పరచుకొనెను. కష్టముమీఁద నచ్చటి సుప్రీంకోర్టులో న్యాయవాదిగ నమూ దయ్యెను. అచ్చటి నియమముల ననుసరించి, తలపాగఁ దీసివేసెను. గాంధి తన నియమము నుల్లంఘించె నని కొందఱు భావించ సాగిరి. కాని ధర్మ మను నది స్థిరజడత్వము గాదని నిత్యచైతన్య మని గాంధి తలపోసెను. గాంధి మాటలలోఁ జెప్పవలె ననిన "సత్యము వజ్రమువలె నెంత కఠినమో కుసుమము వలె నంత కోమలము". ఈ యుదంతము గాంధి జీవిత చరిత్రమున మొదటి నుండి యంతర్వాహినియై జీవనాడి వలె స్రవించు సామరస్యసౌందర్యమును ద్యోతక మొనర్చు చున్నది.

దక్షిణా-ఆఫ్రికా భారతీయ సభకు "నేటాలు ఇండియన్ కాంగ్రెస్" అని పేరు పెట్టఁబడెను. ఈ పేరునకు మాతృక భారత దేశములోని కాంగ్రెసు పేరే. గాంధి యాసభకు కార్యదర్శి.

ఒక నాఁడు బాలసుందర మను తమిళ గిర్మిటియా తలగుడ్డ చేతఁ బట్టుకొని, యేడ్చుచు గాంధి యెదుట నిలిచెను. గాంధి యతనిఁ దలగుడ్డ చుట్టుకొను మని చెప్పెను. అతఁడు సంకోచముతోఁ బాగను జుట్టుకొనెను. తమ తోడి మానవుల నీచముగఁ జూచుటయే తమ గౌరవమునకుఁ గారణ మనుకొను వారి భావములు గాంధి కసహ్యము. ఆ గిర్మిటియా గుడ్డలు చినుగు పాతలు. ఒడలున వణకు. ముందు రెండు పండ్లూడి యుండెను. ఆ కుదుళ్ళనుండి నెత్తురు కారుచుండెను. బాలసుందరమును యజమాని చావమోదెను. గిర్మిటియాకూలీ యజమానికై దేఁడ్లవఱకమ్ముడు పోయిన బానిస. పేరునకై దేండ్లు గాని, యనంతరము నంతియే. గాంధి యతని దీసికొని వైద్యుని కడకేగి, యుల్లాకును బొంచి కోర్టులోఁ గేసు పెట్టించెను. గాంధి కూలీల చట్టము చదివెను. ఆ యజమాని రాజీకి వచ్చెను. అతఁడు బాలసుందరమును దన బానిసతనమునుండి పీడుటకు సమ్మతించెను. కాని యతని నింకొకరు కూలిగఁ, దీసికొనవలెను గదా! గాంధికి మిత్రుఁడైన యొక తెల్లదొర బాలసుందరమును దీసికొనుటకంగీకరించెను. ఈ యుదంతముతో నేటాలులోఁ దమకు న్యాయము సాధింపఁగల భారతీయుఁ డొకఁ డుండె నను తృప్తియు త్సాహము గిరిమిటియాలలో వ్యాపించెను. గాంధికి గిర్మిటియా బాంధవుఁ డని పేరు వచ్చెను.

భార్యాసుతుల దక్షిణ-ఆఫ్రికాకుఁ గొనివచ్చుటకై గాంధి భారతదేశమున కేగెను. భారతదేశమున నతఁడు గోపాలకృష్ణ గోఖలే, లోకమాన్య బాలగంగాధర తిలక్, సురేంద్రనాథ బెనర్జి మున్నగు దేశనాయకులఁ జూచి వారి సాహాయ్యమున దక్షిణ-ఆఫ్రికా భారతీయుల కడగండ్లను గూర్చి సభలు జరిపి స్వదేశీయులకు వివరించెను. దక్షిణ-ఆఫ్రికానుండి తంతి సందుకొని, సకుటుంబముగ గాంధి దాదా అబ్దుల్లా సేట్ గారి యోడ నెక్కి దర్బాను రేవు చేరెను. దక్షిణ-ఆఫ్రికా తెల్లదొరలలో నప్పటికే గాంధిపై ద్వేషము పెచ్చు పెరిగెను. దక్షిణ-ఆఫ్రికా తెల్ల దొరలనుగూర్చి, భారత దేశ మందసత్యప్రచారము సల్పె నని, వారు గుర్రులై యుండిరి. అయిదు రోజులు గాంధి, సహయాత్రికులతోఁ గలసి యోడలోననే యుండిపోవలసి వచ్చినది. చివరకు వా రోడ దిగిరి. ఒక మిత్రుని సలహా ననుసరించి గాంధి భార్యను బిల్లలను వేరొక మిత్రుని యింటికి బండిలోఁ బంపి తాను లాటను దొరతోఁ గలసి కాలి నడకను రేవునుండి కదలెను. ఇంతలో శ్వేత బాలురాతని గాంచి "గాంధి, గాంధి" యని చప్పట్లు చరచిరి. పెద్ద గుంపు మూగెను. గాంధిపై రాళ్లు కుళ్ళిన కోడిగ్రుడ్లు వర్షింప సాగెను. కొంచెము సేపటికి గాంధి తలసాగ మెగిరిపోయెను. అతనిఁ గ్రిందికిఁ ద్రోసి మెడ పెడఁ గొట్టిరి. యాదృచ్ఛికముగ నచటికి బోలీసు సూపరింటెండెంటుగారి భార్య వచ్చి గాంధినిఁ దన గొడుగునీడలోఁ జేర్చెను. అంతలో నొక భారతీయుఁడు వెళ్ళి పోలీసులను దీసికొని వచ్చెను. చిట్టచివరకు గాంధి పోలీసు రక్షణతో భార్యాసుతు లున్న మిత్రుని గృహము

చేసుకొనఁగల్గెను. కాని యీ యింటి చుట్టు తెల్ల దొరలు పెద్ద గుంపుగాఁ జేరి గాంధి నప్పగింపు డని గోల చేయ సాగిరి. పోలీసు సూపరింటెండెంటు అలగ్జాండరు వచ్చి గుంపును శాంతి పరుపఁ జూచెను. కాని యతఁడే గాంధిని మారువేషమున నా యింటి నుండి దాటి పొమ్మని సలహా నిచ్చెను. గాంధి కది సంకట సమయము. ఆనాఁడే మొదట నొక మిత్రుఁడు గాంధిని రేవునుండి రాత్రి యగువరకుఁ గదల వద్దని చెప్పెను. దానికి మొదట సమ్మతించియు గాంధి, మఱియొక మిత్రునిమాట చొప్పున దొంగ వలె దాగి యుండు టేల యని బహిరంగముగఁ బాదచారియై నడచి ముప్పు దెచ్చుకొనెను. ఇపు డేమి చేయ వలెను? ఒక వ్యక్తియే భిన్న సన్నివేశముల భిన్న విధముల సంచరించు చుండును. బాహ్యప్రవర్తన వలననే వ్యక్తియొక్క యాంతరంగిక శీలములను నిర్ణయింప రాదు. గాంధి నల్ల పోలీసు వేషమున నా గృహమునుండి పలాయనము సాగించెను. గాంధి మారువేషమున దాటిపోవు నపుడే, యలగ్జాండరు గారు

"పదపద గాంధిని పట్టూక వద్దాం
పెదచింతకొమ్మాకు వేలాడ దీద్దాం"

అని పాట పాడుచు గుమిగూడిన మూకను నవ్వించుచు నిలబెట్టిరి. చివరకు నెమ్మదిగ గాంధి దాటి పోయెనని బయటఁ బెట్టిరి. మూకలోఁ గొంద రింటిని శోధించి గాంధి లేఁడని చెప్పిరి. ఆ మూక పరిపరి విధముల గొణుగుకొనుచు విసువుతో మరలి పోయెను. అధినివేశ కార్యదర్శి, చేంబర్లేను గాంధిని కొట్టిన వారిని శిక్షింప వలసిన దని నేటాలు ప్రభుత్వము నాదేశిం

చెను. కాని గాంధి యెవరిని శిక్షించుటకు సమ్మతింప లేదు. యథార్థ మెరిగినఁ దామ చేసిన పనికిఁ దామే వగతు రని చెప్పెను.

గాంధి సేవాధర్మములోని నిర్మలపవిత్రత గుర్తించి, తన పనులను దానే చేసికొన మొదలిడెను. అతఁడు బట్టల నుతు కకొనువాఁడు. ఒక నాఁడు తానే శిరోజముల కత్తిరించుకొనెను. కోర్టులో మిత్రులు "గాంధి! రాత్రివేళ నీ తల నెలుకలు తినుచు న్నవా?" యని ప్రశ్నించి వెక్కిరించుఁబడి నవ్విరి. తెల్ల మంగలులు కూలి బారిష్టరునకు క్షౌరము చేయరు గదా! ప్రతికూల పరి స్థితులలోననే మహాపురుషుల మేలి గుణము లొలికి చెంది, వెలుఁగారును. గాంధి యాత్మనిగ్రహమునకు మిక్కిలి ప్రాధాన్య మొసగి బ్రహ్మచర్యదీక్ష నవలంబించెను.

గిరిమిటియాకు సాలుకు 25 పౌనులు (సుమారు 375 రూకలు) పన్ను విధించుటకు నేటాలు ప్రభుత్వము బిల్లు తయా రుచేసెను. గాంధి నాయకత్వమునఁ బెద్ద యాందోళన చెల రేగెను. గిరిమిటియా లందఱు గాంధి నాయకత్వమునకు లోఁ బడిరి. నాటి భారతదేశ రాజప్రతినిధి తలకు సాలుకు మూఁడు పౌనుల పన్ను వేయుటకు సమ్మతించెను. దీని వలన నతఁడు భార తీయ గిరిమిటియాల క్షేమమును గాక తెల్ల దొరల యభిప్రాయ మునకే దోసిలొగ్గెను. నెలకుఁ బదునాలుఁగు షిల్లింగులకంటె నెన్నఁడు నెక్కువ సంపాదింపని యిద్దఱు పిల్లల కుటుంబమునకు సాలుకుఁ బండ్రెండు పౌనులు పన్ను వేయుట యే దేశమున నెప్పుడు నెవరు కని విని యెరుగని యత్యాచారము.

క్రీ॥శ॥ 1897 సంవత్సరమునుండి 1899 సంవత్సరము వఱకు బోయరుల తిరుగుబాటు యుద్ధము జరిగెను. అందు గాంధి మనోభావములు బోయరుల పక్షముననే యున్నవి. కాని, క్షతగాత్రులకు సాయము చేయుటకై లోహిత స్వస్తిక బృందము "రెడ్ క్రాస్"తోఁ గలసి తోడి భారతీయులకు నాయకుఁడై పని చేసెను. తెల్ల దొరలు పత్రికల గాంధిని భారతీయులను మిక్కిలి స్తుతించిరి. పరోపకారము సల్పుటకే తరుణము దొరకినను ముందంజ వేయవలె నని గాంధి యభిప్రాయ మప్పటికే స్థిరరూపమును దాల్చెను. ప్రజాసేవ వలననే యీశ్వర సాక్షాత్కారము కలుగు నని సేవాధర్మమును స్వీకరించెను. దరిద్రనారాయణ సేవయే జన్మసాఫల్య మని గుర్తించెను. దీనుల సేవయే దేవుని సేవ.

దర్బానులో గాంధి యొక యాశ్రమమును నిర్మించుకొని, పవిత్రసరళజీవితమును వైరాగ్య పథమున గడుప సాగెను. ఆ సమయమున భారతీయు లందఱు వ్రేలు ముద్రల నమోదు చేయవలె నను క్రొత్త శాసనము తయారయ్యెను. ఒక మహాందోళనము గాంధి నాయకత్వమునఁ జెలరేగెను. గాంధి దానికి సత్యాగ్రహ మని పేరిడెను. సత్యాగ్రహయోధు లందఱు అహింసా వాదులు. దౌర్జన్యమును నిరసించి, శాంతిగ, దౌష్ట్యమును ధిక్కరింప వలెను. చరిత్రలో స్థిరకీర్తి నార్జించిన సత్యాగ్రహ మను అహింసాపూర్వకమైన ప్రశాంతధిక్కారమును గాంధి దక్షిణ-ఆఫ్రికాలోనే మొట్టమొదటఁ బ్రయోగించెను. మూఁడువేల భారతీయులా యంధశాసనమును ధిక్కరింప శప

ధమును గైకొనిరి. చరిత్రలోఁ గని విని యెరుఁగని మహాశాంతి విప్లవము చెలరేగెను. పదివేలమంది సత్యాగ్రహము సల్పి కారాగారముల నింపిరి. గిరిమిటియాలుఁగూడ మూఁడు పౌనుల పన్నును దిరస్కరించి యుద్యమములోఁ జేరి సత్యాగ్రహ యోధులై నిల్చిరి. ఈ యుద్యమము చాలకాలము సాగినది. గాంధి, సత్యాగ్రహయోధులు చెఱసాలలోఁ బడిన పాట్లనిర్వాచనీయములు. సమ్మెసలిపిన కూలీలను జెఱసాలలలోఁ బెట్టిన యిక్కట్లు ప్రపంచము సంతటినిఁ గలఁచివైచెను. ఆనాటి భారత రాజప్రతినిధి హార్డింజ్ దొరయే దక్షిణ-ఆఫ్రికా ప్రభుత్వమును నిందింపక తప్పినది గాదు. భారతీయులీ కడగండ్లను సాహసముతో నెదుర్కొనిరి. దీని చివరి ఘట్టము చిరస్మరణీయమైన 'గాంధి-స్మట్సు' ఒడంబడిక. అదియే "ఇండియన్ రిలీఫ్‌యాక్టు"గఁ బరిణమించినది. భారతీయుల ముఖ్యములైన కోరిక లన్నియు నీడేరినవి. వ్రేలిముద్రల శాసనము రద్దయినది. గిరిమిటియాలకు మూఁడు పౌనుల పన్ను తప్పెను. సత్యాగ్రహసమరము విశ్వవిజయము గాంచెను.

ఆత్మపారిశుద్ధ్యమునకై ప్రాయోపవేశ దీక్షావ్రతమును గూడ గాంధి దక్షిణ-ఆఫ్రికాలోనే యారంభించెను. ఆశ్రమవాసుల నైతికచ్యుతినిఁ గాంచి, యతఁడు తొలి నిరాహార దీక్షను దర్బానులోఁ బూనెను.

దక్షిణ-ఆఫ్రికాలో నిరువది యేండ్ల ప్రవాసజీవితమును సేవాపథము నడపి గాంధి మాతృదేశమునకు క్రీ॥శ॥ 1915 సంవత్సరమునఁ దిరిగి వచ్చుటకు సంకల్పించెను. దక్షిణ-ఆఫ్రికాలో

నతనికి బహ్మాండ మైన వీడ్కోలు లభించెను. భారతీయు లను రాగపూర్వకముగ నతనికి జరిపిన సన్మానములు, సమర్పించిన కానుకలు లెక్కకు మిక్కిలి. కస్తూరి బాయికి నేబది బంగరు గినియాల గొలుసుకూడ లభించెను. కాని గాంధి యా ద్రవ్య మునంతను నగలతోసహా పజోపయోగము కొఱకు నిధిగా నేర్ప రచి సంరక్షకుల నియమించెనే గాని దమ్మిడి యైనం దాను గైకొ నలేదు. భారత దేశమునకు గాంధి లండను నగరము మీఁదుగ రాఁదల చెను. ఆగష్టు నాలుగవ తేదీన గాంధి లండను చేరెను. ఆఱవ తేదీన మొదటి ప్రపంచ సంగ్రామ మారంభించెను.

బ్రిటనుయొక్క యాపత్సమయమును భారత దేశము యొక్క యవకాశముగ నెంచరాదని గాంధి యెంచెను. అతఁడు బోయరు యుద్ధమునందు వలెనే క్షతగాత్రులకుఁ దోడ్పడుటకు నెనుబది స్వచ్ఛంద సేవకులతోఁ గలిసి పనిచేసెను. కాని, గాంధి యారోగ్యము చెడినది. అతఁడు మాతృ దేశమును జేరుకొనెను. భారత దేశమున గాంధి గోఖలే నాయకత్వమునఁ బ్రజాసేవ చేయఁ దలఁపోసెను గాని గాంధి భారతభూమి చేరిన కొలది రోజులలో గోఖలే పరలోకగతుఁ డయ్యెను. క్రీ॥ శ॥ 1915, మే 25 వ, తేదీన భారత దేశమున గాంధి యహమదాబాదు దగ్గర నర్మదా నదీతీరమున సబర్మతి యాశ్రమ మును స్థాపించెను. ఆశ్రమవాసు లందఱు సత్యము, అహింస చేతి నూలు వస్త్రములు ధరించుట, యస్పృశ్యతా నివారణము, స్వదేశవస్తువులనే వాడుట, దేశభాషలలో విద్యాప్రబోధను, మితాన్న భోజనము మున్నగు దీక్షలఁ గైకొనిరి. గాంధి మూఁడవ

తరగతి రైలు పెట్టెల నెక్కి, భారతదేశ మంతయుఁ బయనించి పల్లీయుల కష్టములఁ దెలిసికొనుచుండెను. లక్నోనగరమున సఖిలభారత జాతీయ కాంగ్రెసున గాంధి యితర దేశమునకు భారతీయులగు గిరిమిటియాలను బంపరాదని తీర్మానమును బ్రతిపాదించెను. ప్రభుత్వము వారా సిద్ధాంతము నామోదించిరి గాని, క్రియాశూన్యులుగనే యుండిరి. గాంధి నాయకత్వమున నొక మహోద్యమము దేశ మంతటఁ బ్రాకినది. ప్రభుత్వము వారందుల కంగీకరించిరి. తరువాత గాంధి చంపరాన్‌లో నీలి పంట కర్షకుల దైన్యము సరికట్టఁ జూచెను. కాని భూస్వాములు కామందులు ప్రతిఘటించిరి. శాంతియుతమైన సత్యాగ్రహమును సాగించి, యచ్చట గాంధి విజయము గాంచెను.

భారతదేశమున గాంధిపేరు మూల మూలల వ్యాపించెను. విశ్వకవి రవీంద్రనాథటాగూరు 'గాంధి' మహాత్ముఁడని స్తుతించెను. క్రమముగ గాంధికి భారత ప్రజల హృదయములో విశ్వచరిత్రలో మహాత్ముఁడను బిరుదు స్థిరమయ్యెను. ప్రపంచయుద్ధము 1919 సం॥ నవంబరులో నంతమొందినది. భారతీయులు కొందఱు స్వపరిపాలనము కొంతవఱకైన లభించునని విశ్వసించుచుండిరి. కాని, మాంటేగు—చెమ్సుఫర్డ్ సంస్కరణ లను పేర భారతీయులకుఁ జిరకాలదాస్యము నొసంగుటకు బ్రిటిషు తెల్ల దొరలు సంకల్పించిరి. దేశ మంతయు నట్టుడికి పోయెను. లాఠీచార్జీలు, తుపాకికాల్పులు, దేశ మంతట సాగెను. ప్రభుత్వ దౌర్జన్యకాండలలో నమృతసరము నందలి జలియను వాలాబాగు పార్కులోని ఘోరహత్యాకాండ ముదాహ

రణ ప్రాయము. ఆ పార్కులోఁ జేరిన ప్రజలను వివక్షత లేకుండ డయ్యారు సేనాని కాల్పించి చంపించెను. పంజాబులో సైనిక శాసనము క్రియుక్త మయ్యెను.

గాంధి మహాత్ముఁడు ప్రభుత్వముక్రూరనీతిని మిక్కిలి తీవ్రముగ నిరసించెను. 1919 స వత్సరము జులై నెల భారత దేశ చరిత్రలో మిక్కిలి ప్రాముఖ్యము వహించినది. గాంధి మహాత్ముఁడు ప్రభుత్వ విధానమును ఖండించి, దేశీయులకు సహాయ నిరాకరణము ప్రబోధించెను. సహాయనిరాకరణోద్యమము జులై 31 వ తేదీన నిరశనవ్రతముతో నారంభింప మహాత్ముఁడు నిశ్చయించెను. ఆ నాఁడే భారత దేశీయ నాయకుఁడైన తిలకు మరణించెను. మఱునాఁడే మహాత్ముఁడు తనకు బోయరు యుద్ధములో మొదటి ప్రపంచ మహా సంగ్రామములోఁ బ్రభుత్వ సేవకుఁ బ్రతిఫలముగ లభించిన పతకముల రాజ ప్రతినిధి కిచ్చివేసెను. స్వరాజ్యము ప్రతిమానవుని జన్మహక్కని యెలుఁగెత్తి చాటిన మహాపురుషుఁడు తిలకు. అతఁడు పండితుఁడు. గణితశాస్త్రజ్ఞుఁడు. వేదాంతి. మాండలే చెఱసాలలో గీతారహస్యమును రచించి ప్రతి భారతీయుఁడును గర్మవీరుఁడు కావలెనని యుద్బోధించిన త్యాగయోగి. స్వరాజ్య సంపాదనమే తిలకున కేకైకలక్ష్యము. పవిత్రలక్ష్యసిద్ధికి సర్వసాధనముల నుపయోగింపవలెను. గాంధికి లక్ష్యముతోఁ బాటు లక్ష్యసాధనములు నంత పవిత్ర మైనవే కావలెను. భారతస్వాతంత్ర్యము గాంధీమహాత్మునికిఁ బవిత్రలక్ష్యము. కాని రక్త పాతమువలన సిద్ధించు భారత స్వాతంత్ర్యము గాంధికి సమ్మతము కాదు.

మహాత్మునకు సత్యము, సహింస ప్రధానములు. స్వాతంత్ర్య సిద్ధి గౌణము. తిలకునకు స్వాతంత్ర్యసిద్ధి ప్రధానము. సాధన మార్గములు గౌణములు. భారత దేశమున నధిక సంఖ్యాకులు తిలకు మహాశయుని గొడుగు నీడలో నిలువ సంసిద్ధులై యుండిరి. కాలవశమున తిలకు భారత రాజకీయ రంగమునుండి యదృశ్యుం డయ్యెను. గాంధి మహాత్ముండే దేశమున కేకైక నాయకుండై నిలి చెను. తిలకు జీవించియుండిన చో భారతచరిత్ర వేరుగ నుండెడిది.

భారత జాతీయ కాంగ్రెసు కలకత్తాలో 1920 సెప్టెంబ రులో సమావేశ మయ్యెను. సంపూర్ణస్వరాజ్యసంపాదనమే కాంగ్రెసు లక్ష్య మని ప్రకటింపబడెను. ఆ నాటినుండి గాంధియే కాంగ్రెసు. కాంగ్రెసే గాంధి. కాంగ్రెసు గాంధి పర్యాయపద ములైనవి. గాంధి, రాట్నముతోనున్న మూడు రంగుల జెండాను కాంగ్రెసు ధ్వజముగ సుప్రతిష్ఠిత మొనర్చెను. కోటి రూపాయల తిలకు స్వరాజ్య నిధికై గాంధి దేశీయుల నర్థిం చెను. కొలది రోజులలో నా నిధి కోటి దాటిపోయెను. రా ట్నము కాంగ్రెసు లాంఛన మయ్యెను. విదేశవస్తు బహిష్కా రమునకై యాందోళన ప్రజ్వరిల్లెను. అహింసాయోధులై శాంతిసైనికులై వేలకొలది ప్రజలు త్రివర్ణధ్వజచ్ఛాయలలో నిలచి ప్రభుత్వము నెదిరించిరి. "యువభారత" మను పత్రికను గాంధి స్థాపించి భారతీయులకు స్వాతంత్ర్య ప్రబోధము సలుప సాగెను. విదేశ వస్త్రములను జేర్చి, స్వచ్ఛంద సేవకులు మంటలు ప్రేల్చ సాగిరి. వేల్సు రాకుమారుడు, యువరాజు భారత దేశమునకు వచ్చినపు డీ యుద్యమమున నచ్చు టచ్చట

చౌరీ చౌరా మున్నగుచోట్లఁ బ్రజలహింసాసిద్ధాంతము నతిక్రమించిరని గాంధి ప్రాయోపవేశ దీక్షను బూనెను. అస్పృశ్యతా నివారణ, నూలు వడకుట, మున్నగు నిర్మాణకార్యక్రమములను సలుప గాంధి ప్రబోధించెను. రోజు రోజునకును భారతీయులు సత్యాగ్రహవీరులై ప్రభుత్వము నెదిరింప సాగిరి. ఫిబ్రవరి 1922 లోఁ బ్రభుత్వమువారు గాంధినిఁ జెఱసాలలోఁ బెట్టిరి. ఇది భారత దేశములో గాంధి తొలి నిర్బంధము. అతని కారేండ్ల కారాగారశిక్ష విధింపఁబడెను. 1924 లో ననారోగ్య కారణమున నతఁడు విడుదల యయ్యెను. హిందూముస్లిము సంఘీభావము కొఱకు గాంధి యిరువదియొక్క రోజులు ప్రాయోపవేశ దీక్షఁబూనెను. ఆ సంవత్సరమే యతఁడు బెల్గాం కాంగ్రెసున కధ్యక్షత వహించెను. మహాత్ముఁడు, ఖద్దరు మద్యపాననిషేధము హరిజనోద్ధరణమే దేశక్షేమమునకుఁ దారకమంత్రము లని యుపదేశించెను. 1928 సంవత్సరమున స్వపరిపాలన నిచ్చుటకు భారతీయుల యర్హత ననుశీలించుటకు సైమను యాజమాన్యమున నొక సంఘము సీమనుండి దిగెను. సైమను సంఘము భారత దేశమున నెచటి కేగినను నల్ల జెండాలే స్వాగత మిచ్చినవి. ప్రభుత్వము ప్రజల నణచుటకు దౌర్జన్య హింసాకాండ నారంభించెను. 1930 సంవత్సరమందు కాంగ్రెసు కార్యవర్గము సబర్మతి సమావేశమున సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించుటకు సత్యాగ్రహోద్యమము నారంభించుటకుఁ దీర్మానించెను. 1930 మార్చి 12 వ తేదీన గాంధి మహాత్ముఁడు దండి యుప్పు సత్యాగ్రహ దండయాత్ర కుపక్రమించెను. మహా

త్ముఁ డనుయాయులతోఁ గలసి స్వాతంత్ర్యము సంపాదింపక తిరిగి రాఁగూడ దను శపథముగై కొని సబర్మతి యాశ్రమము నుండి యా చరిత్రాత్మిక యాత్ర నుపక్రమించెను. సత్యాగ్రహము ప్రభుత్వ శాసన ధిక్కార రూపమును దాల్చెను. సముద్రజలములనుండి యుప్పు ప్రభుత్వమునకుఁ బన్ను చెల్లింపక తామే తయారు చేయ వలెను. "ఉప్పు సర్వజనులకు జీవితప్రాథమికావసరములలో నొకటి. స్వాతంత్ర్యము సర్వజనులకు స్వయంవిదితము కావలె నన్న నీ యుప్పు పన్ను రద్దు కావలెను." సబర్మతి వీడినది మొదలు దండి చేరు వఱకు మహాత్ముని కెదు రేగి ప్రజలు బ్రహ్మాండమైన స్వాగత మిచ్చిరి. శాసనధిక్కారము, మద్యపాననిషేధోద్యమము, విదేశ వస్తు వస్త్ర బహిష్కారోద్యమముతోఁ బాటు యుప్పు సత్యాగ్రహము దేశ మంతట సాగెను. ఆసేతు హిమాలయము స్వాతంత్ర్య యజ్ఞ కుండ మయ్యెను. ప్రభుత్వోద్యోగులు, గ్రామోద్యోగులు తమ తమ పదవులకు రాజీనామా నిచ్చి సత్యాగ్రహోద్యమమునఁ జేరిరి. ఏప్రిలు ఆరవ తేదీన మహాత్ముఁడు సముద్రతీరమున నుప్పు పోగు చేసి శాసనధిక్కారమును సలిపెను.

ఆ నాటి త్యాగదీక్ష పవిత్రోత్సాహము నిర్మలశీలము లతిలోకములు. 100,000 మంది సత్యాగ్రహయోధులు పదవులను త్యజించి, కుటుంబముల వదలి కారాగారములకుఁ బోయిరి. మహాత్ముఁడు, సరోజినీ దేవి, పండిత జవహరులాలు నెహ్రూ మున్నగు వారందరు బందీకృతులైరి. భారత దేశ చరిత్రలో నుప్పు సత్యాగ్రహఘట్టము చిరస్మరణీయము. సత్యాగ్రహులు

సముద్ర గాముల్త్రై తరలి పోసాగిరి. దేశమధ్యములోని బావుల యుప్పు నీటి నైన మరిగించి సత్యాగ్రహమును సాగించిరి. రవి యస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యము! నిరాయుధులు దాస్య విహ్వలులు నైన భారతీయులు! 1857 సంవత్సరమున "సిపాయీల తిరుగుబాటను ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమునం బరాజితులైన భారతీయులకు దాస్యవిమోచనమున కేక మార్గమే లేదనిపించినది. బ్రిటిషు సామ్రాజ్యవాదముయొక్క యుక్కు చెప్పుల క్రింద భారతస్వాతంత్ర్యాకాంక్ష నలిగి పోయెను. భారతదేశము బ్రిటిషు సామ్రాజ్యతత్త్వమునకు దాసోహము నర్పినది. అట్టి జాతీయ దైన్యస్థితిలో మరఫిరంగులను, శతఘ్నులను నెదిరింపగల యాత్మ శక్తిని, యహింసా వాదమునం బ్రసాదించి, మహాత్ముండు భారతీయులను లోకోత్తర ధర్మవీరులుగం దీర్చి దిద్దెను. "లాఠీలకుం దుపాకులకు నిర్భీతితో గుండె నొగ్గుము. ఆత్మ బలిదానమే విశ్వవిజయము." గాంధి మహాత్ముని రాజకీయ వేదాంత మపూర్వము. అందు శత్రు ద్వేషము లేదు. ఆత్మసంయము వలన శత్రుహృదయమున శుభపరివర్తనమును సాధించుటయే మహాత్ముని తత్త్వము. అహింస, సత్యదీక్ష, ఖద్దరు, హరిజనసేవ, బ్రహ్మచర్యము మున్నగు నవి మహాత్ముని జీవిత వేదాంతమున నపరిహార్యము లైన ధర్మములు. కాంగ్రెసు వానినే రాజకీయ రంగమున స్వాతంత్ర్యసాధనకు మార్గములుగ స్వీకరించెను. భారతదేశము నందలి మేధావులు, దేశభక్తులు మహాత్ముని నాయకత్వమునం గారాగారముల కేగిరి. రాజప్రతినిధి యిర్విను ప్రభువు 1931 సంవత్సరమున మార్చి నెలలో మహాత్ముని,

సత్యాగ్రహము సల్పిన ఖైదీలను విడుదల చేసెను. గాంధీ-యిర్విను ఒడంబడిక చరిత్రలోఁ జిరప్రసిద్ధము. దానివలన శాసన ధిక్కారోద్యమ మాగినది. స్వీయోపయోగమునకై వ్యక్తు లుప్పు తయారు చేసికొన వచ్చును. మద్యపాన నిషేధోద్యమము, స్వదేశీయ వస్తు ప్రచారము శాంతముగ సాగించుకొన వచ్చును. తరువాత వెల్లింగ్డను ప్రభువు రాజప్రతినిధి యయ్యెను. మహాత్ముఁడు 'రౌండు టేబిలు' సమావేశమున కాహ్వానితుఁడై సీమకు వెడలెను.

అస్త్రసన్యాసము సల్పి, యజాత శత్రువై బ్రిటిషు సామ్రాజ్యము నెదిరించి నిల్చిన స్వాతంత్ర్యవిజేత యహింసామూర్తి బక్క చిక్కిన బడుగు దేహముతోఁ జేతితో వడికిన నూలు గుడ్డను నంగ వస్త్రముగ ధరించి, బోసి నవ్వు లొలుకుచు సాక్షాత్కరించెను. మహాత్ముని దర్శనార్థము మార్గమధ్యమున నేడెను, కైరో, మార్సెయిల్సు నగరములఁ బ్రజలు తండోపతండములుగ గుమి గూడిరి. లండను నగరమున స్వాతంత్ర్యతపస్వి మహాత్మునకు ఘనస్వాగతము లభించెను. బ్రిటిషు రాజు జార్జి చక్రవర్తి, రాణి మహాత్ము నాహ్వానించిరి. లండనులో మహాత్ముఁడు శ్రామికుల పేటలో నివసించెను. మానవకృషికి మహాత్ముఁడు కల్పించిన పవిత్రత పేర్కొనఁదగినది. పాకీదొడ్లను దుడుచుట యాశ్రమజీవితమున మహాత్ముని దినచర్యలోఁ బరమ పవిత్రవిధి. కార్మికుఁడు పూజ్యుఁడు. శ్రమపవిత్రమైనది నీచమైన శ్రమ లేదని ప్రపంచమున కెలు గెత్తి చాటినవాఁడు మహాత్ముఁడు. మహాత్ముని లండనులో శ్రామికులు, తత్త్వవేత్తలు,

నవులు సందర్శించిరి. "రౌండు టేబులు సమావేశమున" మహాత్ముఁడు స్వాతంత్ర్య లాలసు లైన భారతీయుల యాశయములను గూర్చి గంభీరోపన్యాస మొసగెను. బ్రిటిషు సామ్రాజ్యవాదులకు మహాత్ముని భావములు నచ్చ లేదు.

మహాత్ముఁడు భారతదేశమునకు 1931 డిసెంబరు 28వ, తేదీన తిరిగి వచ్చెను. 29న తేదీన నతఁడు రాజప్రతినిధినిఁ జూడఁ గోరెను. కాని రాజప్రతినిధి యంగీకరింప లేదు. కాంగ్రెసు కార్యవర్గము తిరిగి సత్యాగ్రహోద్యమము నారంభించి మహాత్ముని నాయకునిగా నియమించెను. ప్రభుత్వము కాంగ్రెసు సంస్థ యక్రమ మని ప్రకటించి మహాత్ముని చెఱసాల యందుంచెను. తిరిగి సత్యాగ్రహమున లక్షమంది భారతీయులు బందీకృతు లైరి.

సత్యాగ్రహోద్యమమున భారతదేశమున 12,000మంది ముస్లిములు దేశభక్తు లై హైందవ సోదరులతోఁ గలిసి చెరసాలల కేగిరి. ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ వాయువ్యరాష్ట్రమున 'లోహితకంచుక' బృందమును స్థాపించి సత్యాగ్రహమునఁ బాల్గొనెను. అతఁడు "సరి హద్దు గాంధి" యని ప్రఖ్యాతి కెక్కెను. హిందువులకు ముస్లిములకు మధ్యఁ గలచారిత్రక వైరమును మరచి యందఱు బ్రిటిషు సామ్రాజ్యము నెదిరించుట తెల్ల దొరలు సహింప లేదు. హరిజనులు దుర్భర దారిద్ర్యములో మునిగి యుండి కూడ స్వాతంత్ర్యసత్యాగ్రహోద్యమమున ముందంజ వేయుట వారి కాశ్చర్య మాయెను. భారతదేశమున సామ్రాజ్యవాదము చిరంజీవిగ వర్ధిల్లుటకు బ్రిటిషు దొరలు "చీలఁ

దీసి పాలించుట" యను కూటరాజనీతి నవలంబించిరి. ఇదే "కమ్యూనలు-అవార్డు." దీనివలన ముస్లిములకు, హరిజనులకు ప్రత్యేకనియోజకవర్గములు లభించినవి. గాంధి "కమ్యూనలు-అవార్డు" అను జాతి వర్గ విభజన పూర్వక మగు భారత జాతీయైక్యనాశనమునకు సమ్మతింపక ప్రాయోపవేశ దీక్షం బూనెను. ముస్లిములలోం గొందరు ప్రత్యేక నియోజక వర్గములకై "ముస్లిములీగు" ద్వారమున యాందోళన సలిపిరి. హిందువులనుండి హరిజనులను విడదీయుట యసలే కూడ దని మహాత్ముండు కారాగారమునం బ్రాయోపవేశదీక్షను బూనెను. పూనాలో హిందూహరిజననాయకులు సమావేశమై ప్రత్యేక నియోజక వర్గములక్కర లేదని తీర్మానమును బ్రకటించిరి. ప్రభుత్వము హిందూ హరిజనప్రత్యేకనియోజక వర్గముల రద్దు గావించెను. మహాత్ముండు ప్రాయోపవేశ దీక్ష విరమించెను.

హిందూ ముస్లిము సంఘీభావము, హరిజనోద్ధరణ మహాత్మున కత్యంత ప్రీతిదాయక విషయములు. అతండు హరిజన సిద్ధికై నిత్యము విరాళములం బ్రోవు చేసెడివాండు. హిందూ సంఘమున నస్పృశ్యతా పిశాచము తొలంగుటకు మహాత్ముని సేవ గణనీయము. సత్యాగ్రహోద్యమము, కాంగ్రెసు గోష్ఠికుల కారాగార వాసము, లాఠీచార్జీలు, తుపాకి ప్రేల్పులు, ఉరిశిక్షలు, సమ్మెలు, ప్రభుత్వనిరసనతీర్మానములు రెండు శతాబ్దులు భారత దేశచరిత్రలో మిక్కిలి ప్రాముఖ్యము వహించినవి. బ్రిటిషువారు 1937 సం॥లో భారతీయస్వపరిపాలన నెలకొల్పుటకు భారతదేశమున నెన్నికలు జరిపిరి. కాంగ్రెసున కఖండ విజ

యము సిద్ధించినది. ఈ యెన్నికలలో ముస్లిములకుఁ బ్రత్యేక నియోజకవర్గములు. సరిహద్దు రాష్ట్రమున నధికసంఖ్యాకులు ముస్లిములే. అచ్చటఁ గాంగ్రెసునకే విజయము సిద్ధించెను. వంగ, పంజాబు, సింధురాష్ట్రములలో ముస్లిములీగునకు ముస్లిము స్థానము లెక్కువ లభించినవి. భారతదేశమున సింధు, పంజాబు రాష్ట్రములు వినా కాంగ్రెసు ప్రభుత్వము లేర్పడినవి. ఆ రెండు రాష్ట్రములలో సంకీర్ణ ప్రభుత్వము లేర్పడినవి. కాని - ప్రత్యేకనియోజకవర్గము లినుమడింపఁ జేసిన హిందూ ముస్లిము ద్వేషాగ్ని రగుల్కొనుచునే యుండెను.

1939 సంవత్సరమున ద్వితీయప్రపంచయుద్ధ మారంభమయ్యెను. భారతదేశ ప్రభుత్వము, భారతీయులతో నే ప్రస్తేయము లేకుండ బ్రిటనుతోఁ గలసి జర్మనీదేశముపై యుద్ధము ప్రకటించెను. గాంధి బ్రిటను విపత్తును భారతదేశము యొక్క యవకాశముగ గ్రహింపరాదని, బ్రిటనుకుఁ జిత్తశుద్ధితో నేమియు గోరకుండ భారతీయులు తోడ్పడవలె నని ప్రకటించెను. కాని కాంగ్రెసు కార్యవర్గము దేశీయుల సలహా గాని యభిమతమును గాని స్వీకరింపక భారత దేశమును యుద్ధములోనికి దింపిన బ్రిటిషు చర్యను గర్హించిరి. అసమ్మతి సూచకముగ రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వములు రాజీనామా నొసగెను. బ్రిటిషు ప్రభుత్వము తమకే నిరాఘాటనిరంకుశత్వము లభించి నందులకు సంతోషించిరి.

మహాత్ముని ఖద్దరుదీక్షకు విదేశవస్త్ర బహిష్కారమే ప్రధానోద్దేశము కాదు. అతఁడు గ్రామములు స్వయం సంపూ

ష్టములై, తొల్లిటి యార్థిక వ్యవస్థలతో కలిసిపోవలె నని తలపోసెను. గాంధి యీ యంత్రయుగనాగరికత మానవత్వమును నాశనము సల్పుచున్న దని యెంచెను. యంత్రముల వలన నధికోత్పత్తి, యధికోత్పత్తి వస్తువుల నమ్ముకొనుట కధినివేశ రాజ్యములు, తత్సంపాదనకు యుద్ధములే యీ యంత్ర నాగరికతకు ఫలితములు. మానవుడు కోరికల నభివృద్ధి చేసుకొని, యా కోరికల నీడేర్చుకొనుట కధికోత్పత్తిని సాధనముగా గ్రహించుచున్నాడు. కోరికలకు దృప్తి యుండుట యసంభవము. అనుభవమునకు వాంఛాప్రవృత్తి సదా పురోగామి. భోగలాలసత, యధికార తృష్ణ వలన మానవుడు ఎండమావుల నెంబడించుచున్నాడు. "కావున కోరికలను దగ్గించుకొనుము. పీతాంబరములు, మేడలు, మిద్దెలు, విమానములు, మరఫిరంగులు, నధినివేశ రాజ్యములు మానవునకు దృప్తి గలిగింప లేవు. ఆశలకవధులు లేవు." చేనూలు ముతకఖద్దరు బట్టలు భారత దేశమున స్వాతంత్ర్య దీక్షా వస్త్రము లైనవి. గాంధి సేవాగ్రామున దన యాశ్రమమునుండి యీ ప్రబోధమును వెలయించ సాగెను. మహాత్ముడు భారతదేశమున మకుటము మాత్రము లేని మహారాజు. సేవాగ్రామ మనధికార రాజధాని. ప్రపంచ శాంతి ప్రియులకు నిత్యపవిత్ర తీర్థయాత్రాస్థలము. ఒక విదేశయాత్రికుడు "నీ వేల భారత దేశమునకు వచ్చితివ"ను ప్రశ్నకు సమాధానముగ జెప్పిన వాక్య ముదాహరణప్రాయము. "నేను భారత దేశమునకు దాజ్‌మహాలును, హిమాలయములను, మహాత్ముని సందర్శింప వచ్చినాను." ఒక విదేశవనిత మహాత్ముని

"మీ కెందఱు పిల్లల"ని ప్రశ్నించెను. మహాత్ముఁడు బోసి నవ్వ్వొలొలుకుచు, "వేలు; లక్షలు" అని సమాధానము చెప్పెను. అందుచేతనే భారతీయులు మహాత్ముని "బాపూజీ" యని ప్రేమతోఁ బిలుచుకొనిరి. మహాత్ముని బోసి నవ్వు జగన్మోహనము. హాస్య రస తరంగితము లైన యతని సూక్తులు విశ్వవిఖ్యాతములు.

ద్వితీయప్రపంచయుద్ధమున మహాత్ముఁడు తన నైతి కాశీస్సులు బ్రిటిషు మిత్రమండలి పక్షమునకే యొసంగితి ననియు, దౌర్జన్య పూరిత మైన యుద్ధ మను మాటకే ప్రతికూలుఁడ ననియుఁ బ్రకటించెను. కాంగ్రెసు, భారతీయులకు నిజ మైన యధికార మిచ్చిన, బ్రిటిషు ప్రభుత్వముతో సహకరించు టకు సమ్మతించెను. ముస్లిము లీగు, భారత దేశమును విభజించి పాకిస్థానమును సర్వ స్వతంత్ర మైన ముస్లిము రాజ్యముగ స్థాపించుటకుఁ దీర్మానించెను. మహాత్ముఁడు భారత దేశవిభజనకుఁ దన యసమ్మతిని సుస్పష్టముగఁ బ్రకటించెను. 1942 సంవత్సర మున బ్రిటిషు ప్రభుత్వము, క్రిప్సు మంత్రిని భారతీయుల సహాకారముతోఁ దాత్కాలిక ప్రభుత్వ స్థాపనకు మార్గముల నన్వేషించుటకు భారత దేశమునకుఁ బంపెను. క్రిప్సు ప్రణాళికకు ముఖ్యసూత్రము యుద్ధానంతర స్వాతంత్ర్యము. బ్రిటిషుప్రభుత్వము మిత్రమండలి ప్రజాస్వామ్యసంరక్షణార్థము, జగత్కల్యాణము కొఱకై నియంతృత్వము నెదిరించు చుంటి మని ప్రకటించిరి. ప్రపంచజనసంఖ్యలో నైదవ వంతున్న భారతీయులను దుర్భరదాస్యములో నణఁగ ద్రొక్కుచున్న బ్రిటిషు ప్రభుత్వము ప్రజాస్వామ్యముకొఱకై సల్పు యుద్ధమును

నారంభించుటకు ముందే మోటమిని పొందియుండెనని మహాత్ముఁడు ప్రకటించెను. క్రిష్ను ప్రణాళికను మహాత్ముఁడు రాఁబోవు తేదీ వేసిన "బ్యాంకు చెక్కు"ని ప్రవచించెను. కాంగ్రెసు ముస్లిము లీగు లా ప్రణాళికను నిరసించినవి.

కాంగ్రెసు మహాత్ముని యాధ్వర్యమున సత్యాగ్రహము సాగించెను. తిరిగి కాల్పులు లాఠీచార్జీలు చెలరేగినవి. "భారత దేశమును వీడుడ"ను మహాత్ముని సింహగర్జనమే యా యుద్యమమునకు శంఖారావము. చెఱసాలలు నిండినవి. మహాత్ముఁడు పూనాలో 'ఆగాఖానుభవనము'న నిర్బంధింపఁబడెను. నెహ్రూగారు మొదలైన కాంగ్రెసు నాయకు లందఱు నిర్బంధింపఁబడిరి. దేశ మల్లకల్లోల మయ్యెను. తంతితీగెలు రైలు పట్టాలు కొన్ని చోట్ల నదృశ్య మయ్యెను. 1942 సంవత్సర సత్యాగ్రహము విప్లవముగఁ గొన్ని చోట్లఁ బరిణమించెను. హింసాకాండతోఁ దనకుఁ గాని కాంగ్రెసునకుఁ గాని సంబంధము లేదని మహాత్ముఁడు ప్రకటించెను. 1944 సంవత్సరమున మహాత్ముఁడు విడుద లయ్యెను. ఇటలీ, జర్మనీ దేశము లోడిపోయెను. జపానుతో యుద్ధము సాగుచుండెను. ఇంగ్లండు దేశమున నెన్నికలలో విజయము సంపాదించి కార్మిక పక్షము గెలుపొందెను. కార్మిక ప్రభుత్వము కాంగ్రెసు నాయకులను విడుదల సల్పి, భారత దేశమునకు స్వాతంత్ర్య మొసగుటకు సమ్మతించెను. 1944 సం. మే నెలలోఁ గార్మిక ప్రభుత్వ పక్షమున సంప్రదింపులు సలుపుట కమాత్యత్రయము భారత దేశమున కేతెంచిరి. అంతకుముందే జరిగిన యెన్నికలలో కాంగ్రెసునకు విజయము సిద్ధించియుండెను. ముస్లిము స్థాన

ములు ముస్లిములీగు సరిహద్దు రాష్ట్రమునఁ దప్ప సంపూర్ణ విజయము సాధింపఁ గల్గెను. పాకిస్థానప్రచార మవిరళముగ జిన్నా నాయకత్వమున సాగుచుండెను

దేశమున మతవిద్వేషము ప్రబలి, కల్లోలములు చెల రేగెను. కలకత్తాలో మతకలహములు తీవ్రరూపమును దాల్చెను. అందు హిందూ ముస్లిము లన్యోన్యహననకాములై దురంత చర్యలకుఁ బాల్పడిరి. లూటీలు, స్త్రీ బాల వృద్ధ విచక్షణ లేని ఘోరహత్యలు మత కలహముల పేర భారత దేశ చరిత్రకు స్థిర కళంకమును దెచ్చెను. నవకాళిలో ముస్లిములు చెల రేగి హిందువులపై ఘోరహింసలు నత్యాచారములు సలిపిరి. ఈ మతోన్మాదహింసా విలయ తాండవమును నిరసించి నిల్చిన మహానుభావుఁడు గాంధి మహాత్ముఁడు.

గాంధి మహాత్ముఁడు పదవులకై పాకులాడుట తప్పని ఘోషించెను. మానవుఁడు హక్కుల కొరకై పోరాడుట కంటె బాధ్యతలను నిర్వర్తించుటయే మే లని చాటెను. 1947 సంవత్సరమున జనవరి నెలలో నవకాళియాత్ర కుపక్రమించెను. గాంధి యాత్రవలనఁ బ్రజల మనస్సులలో శుభపరివర్తన మేర్పడెను. కలకత్తాలో శాంతి నెలకొనెను. మహాత్ముఁడు భారత దేశమున జీతము బత్తెము తీసికొనక పనిచేయు ముఖ్యరక్షక భటుఁడని పేరు వడసెను. తరువాత నవకాళికిఁ బ్రతిక్రియగాఁ జెల రేగిన బీహారు కల్లోలమున నాహుతులైన ముస్లిములకు సాయము చేయుటకై గాంధి మహాత్ముఁడు బీహారు ప్రయాణము సాగించెను. సత్యమహింసల నుచ్ఛ్వాస నిశ్వాసములు సల్పి జీవించెడి యొం

టరి బాటసారి, మతోన్మాదవికటాట్టహాస విలయప్రభంజన తాండవము నెదిరించి పయని చెను.

కాంగ్రెసు లీగునాయకులతో జరిగిన సంప్రదింపుల ఫలితముగ దేశమును విభజించి పాకిస్థానము, భారత దేశములకు 1947 ఆగష్టు 15 వ తేదీన స్వాతంత్ర్య మొసగుటకు నిశ్చయించి నట్లు కార్మిక ప్రభుత్వము 1947 జూను 3 వ తేదీన ప్రకటించెను. పంజాబులో మతకల్లోలములు చెలరేగినవి. హిందువులు, సిక్కులు, ముస్లిములు వేలకొలది మరణించిరి. ఆ దురంత హత్యాకాండమును దలచి యే భారతీయుడును సిగ్గుచే దల వంచుకొనకుండ నుండ లేడు. ప్రపంచ చరిత్రలో నట్టి ఘోర సన్ని వేశము లెన్ని యో యుండవు

1947 సంవత్సరము ఆగష్టు 15 వ తేదీన స్వతంత్ర భారత దేశ పాకిస్థానము లవతరించినవి. భారత దేశ మంతయు స్వాతంత్ర్యోదయమున కుప్పొంగి పండుగ చేసికొనెను. మహాత్ముం డా సమయమున ఢిల్లీలో నుండక నవకాళిలో మిగిలి పోయిన తన కర్తవ్యమును నెరవేర్చుట కేగెను. గాంధిమహాత్ముండు నూత్నస్వతంత్ర భారతవర్షము నాశీర్వదించెను. దేశనాయకులకు మహాత్ముని యాశీస్సులే ధ్రువతారకారోచిస్సులు.

భారత దేశ స్వాతంత్ర్యమునకంటె ధర్మనిర్వాహణమే మహాత్ముని కర్తవ్యమున నగ్రగణ్యము. రవి యస్తమించని మహాసామ్రాజ్యము నెదిరించు నాత్మిక శక్తిని పరాధీన విహ్వలు లైన భారతీయుల కొరకు నాడు ప్రసాదించెను. ఆ నాడు భారత స్వాతంత్ర్యము గాంధి మహాత్మునకు శిరోరత్నమై భాసిల్లెను.

గాంధి మహాత్ముని యాధ్యాత్మికమూర్తి, వామనమూర్తి వలె క్షణ క్షణ పరివర్ధమానమై విశ్వము నంతటి నావిష్కరించుకొనెను. శిరోరత్నముగా భాసించిన భారత దేశస్వాతంత్ర్యమహింసా ప్రవక్త యాధ్యాత్మికమూర్తి కచిరకాలమున శ్రీవణావతంసముగఁ గంఠ మణిగఁ జిట్టచివరకుఁ బాదపీఠికా మణిగ మారెను. గాంధి మహాత్ముఁడు భారత స్వాతంత్ర్యశిల్పి మాత్రమే గాదు. స్వాతంత్ర్య సముపార్జన మహాత్ముని జీవితచరిత్రలో నొక యత్యల్ప విషయము మాత్రమే. మానవత్వమును వీడి 75000 మనుష్యుల నొక్క త్రుటిలో సంహరించు "ఆటము బాంబులు" నిర్మించు సభ్యతను ధిక్కరించి హింసాదౌర్జన్యముల రాక్షసత్వమును నిరూపించి, యీ భూగోళమును మానవునకింత కంటె వాసయోగ్యముగఁ జేయుటకై తరణోపాయము ప్రబోధించిన యతిలోక తేజస్వి మహాత్ముఁడు.

1947 సంవత్సరము సెప్టెంబరులో ఢిల్లీనగరమున మతకల్లోలము లారంభించెను. మహాత్ముఁడు ఢిల్లీ చేరెను. అతఁడు ప్రాయోపవేశ దీక్షఁ బూనెను. ఢిల్లీ ప్రజ లందఱు మానసిక పరివర్తనమును బొంది మతసామరస్యమును బెంపొందింప శపథము సల్పిరి. మహాత్ముఁడు నిరాహారదీక్ష విడనాడెను. 1948 సంవత్సరము జనవరి నెలలో మహాత్ముని ప్రార్థనసభలో నొక యువకుఁ డొక బాంబు రువ్వెను. ప్రమాద మెవరికి జరుగ లేదు.

మహాత్ముఁడు ప్రభుత్వము తనకు సైనిక రక్షణ మొసఁగుటకు సమ్మతింప లేదు. మహాత్ముఁడు మహాభక్తుఁడు. దీనసేవ గూడ నీశ్వర సాక్షాత్కారమార్గముగనే స్వీకరించెను.

అంతియేగాక ప్రార్థనసభలోఁ దన్ను నిరాఘాటముగ హత్య చేయ వచ్చు నని ప్రకటించెను. హంతపై ద్వేషము లేక, పెదవులపైఁ జిరునవ్వులతో మరణించుటయే తన జీవితసాఫల్య మని ప్రవచించెను.

మానవచరిత్ర బుద్ధభగవానుని నేసు క్రీస్తు ప్రభువును దప్ప మహాత్ముని వంటి యజాతశత్రుని దయామయునిఁ బ్రసాదించి యుండలేదు.

1948 జనవరి 30 వ తేదీన సాయంకాలమున మహాత్ముఁడు ప్రార్థనసభ కేగుచుండెను. మతదురావేశ ఘాతుకుఁడైన 'నాథూరాం వినాయక గాడ్సే' యెదురు వచ్చి సాష్టాంగ నమస్కారము సల్పి గురి చూచి సూటిగా మహాత్ముని గుండెలో రివాల్వరు పేల్చెను. "హేరే రాం" అనుచు మహాత్ముఁడు నేల కొరిగెను. ప్రపంచచరిత్రలో గడియారగ మెప్పుడును నంత యుత్కంఠతోఁ గొట్టుకొన లేదు. మహాత్ముని భవనను లోనికి గొనిపోయిరి. అహింసాప్రవక్త యస్తమించెను. సూర్యుఁ డస్తమించెను.

ప్రపంచ మంతయుఁ జీకటి గ్రమ్ముకొనెను. మహాత్ముని నిర్యాణవార్త ప్రపంచమును దుఃఖమయమునుగఁ జేసెను. ప్రపంచరాజ్యము లన్నియు పతాకల నర్ధావరోహణము గావించి విషాదమును బ్రకటించినవి. మరునాఁడు సాయంకాలమున యమునానదీతీరమునఁ జందన కాష్ఠమున మహాత్ముని భౌతిక దేహమున కగ్నిసంస్కారము కావింప బడెను. ఆనాఁడు

ప్రపంచములో నెచ్చట సంపూర్ణారోహణముగ నెగురు చున్న పతాకము లేదు.

సిలువఁబడిన యేసుక్రీస్తు ప్రభువు తరువాతఁ బ్రపంచ చరిత్రలో మహాత్మునిహత్య రెండవ యాత్మబలిదానము.

మహాత్ముఁడు సజీవుఁడై యున్న కాలముననే, ప్రపంచ చరిత్రలోని మేధావులలో నగ్రగణ్యుఁ డని స్థిరకీర్తి నార్జించిన 'ఐన్‌స్టీను' మనీషి మహాత్మునకుఁ బూజాంజలు లర్పించెను. "బాహ్యాధికారము లేవియు లేని ప్రజానాయకుఁడు. రాజనీతి కుతంత్రముల నిరసించి, యాత్మికశక్తితో విజయము సాధించు రాజకీయవేత్త. అస్త్రసన్న్యాసము సల్పి యధర్మము నెదిరించి గెలిచిన విజేత. యూరోపులోని పాశవిక దార్ఢ్యము నకుఁ జెలియలికట్టయై నిలిచి మించిన నిర్మల సాధుపురుషుఁడు. రాబోవు తరముల వారు రక్తమాంసల మైన రూపము దాల్చి, యిట్టి మహాపురుషుఁడు భూగోళమున సంచరించె నని విశ్వసింపక పోవచ్చును."

నేటి ప్రపంచమున యుద్ధహోమకుండ మింకను రాజు కొనుచుఁ బొగలు గ్రమ్ముచునే యున్నది. "ఉదజని బాంబు" విధ్వంసకశక్తి 'యాటము బాంబు' కంటె సహస్ర గుణాధి కము. ఉదజని బాంబులతో యుద్ధము జరిగిన నిఁక భూగోళ మున మానవ జాతియే యంతరింప వచ్చును. "భూలోకమున నొకానొకనాఁడు మానవు లుండెడివారు. వా రెంతయో మేధావులై యాకాశమునఁ బక్షివలె సంచరింపఁ గలిగినారు. నీటిలోఁ జేపవలె నీదుకొని పయనింపఁ గలిగినారు. చివరకు

భూమిపై మానవులవలె పునలేక యన్యోన్యమారణహోమము నారంభించి పూర్ణాహుతి నొందినార”ని చిట్టచివర కే నీకలోఁ దమ వాఙ్మయమునఁ గరుణాగీతుల నాలసింప వలసి వచ్చునేమో! భావిప్రపంచమున మానవజాతి యస్తిత్వమే శంకాస్పద మగు చున్న చిమ్మచీఁకటిలో గాంధి మహాత్ముని యమృత సందేశమే దివ్యజ్యోతి. అద్యతన భావిలో మానవుఁడు మన వలె నవిన గాంధి మహాత్ముని యమరవాణిని వినక తప్పదు.

మానవుఁడు జీవించి యుండుటకై మహాత్ముఁడు మరణించెను. మానవుఁడు మహాత్ముని శాంతి సందేశము నాలకించి మను గాత!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఇతి శివమ్.